# ధనము పొదుపు కొరకు

# "ఉమా"

22. క్యారట్లు బంగారు రేకు కవరింగు నగలనే కొనండి.

అనేక సంవత్సరములు మన్నికగా యుండును.



















బొత్తాములు రు. 1/- కఫ్సు-బొత్తాములు రు. 2/-

జత గాజులు— 2½ సైజు నం. 203 - జత రు. 14/40;

నం. 705/2 జుంకీ - జత రు. 6/-;

నం. 37 ఉంగరాలు జత రు. 2/-.

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

H.O. ఉమా మహల్.. మ… పట్టణము. ఇండియా

ప్రా… సుబ్బయ్య

90, చైన… మద్రాసు-1

శివాలయం వీధి, విజయవాడ

104, కామధేను బిల్డింగు, ఎవెన్యూ రోడ్డు, బెంగుళూరు సిటీ

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# వైట్ హార్స్ సబ్బు




**WHITE HORSE SOAP**

.... గుడ్డల మురికిని పోగొట్టుటలో
అగ్రస్థానము వహించినది.
పట్టు, లినన్ గుడ్డల చలువకు శ్రేష్ఠమైనది.

| | |
|---|---|
| బారు ఒకటి: | రు. 1-00 |
| పెద్ద సైజు కేకు: | 0-31 న. పై. |
| మీడియం సైజు: | 0-19 న. పై. |
| శాంపిల్ సైజు: | 0 07 న. పై. |

తయారుచేయువారు:

## నేషనల్ ఇండస్ట్రీస్,

మదరాసు - 21

---

మృదువైన చర్మమునకు

## ఫెస్టివల్

## సూపర్ శాండల్ టాల్కం పౌడర్

అండు

## స్నో






ఫోన్: 2788

మురళి ట్రేడర్స్ మదరాసు-21

తంతి: "Mursoks"

ప్రతిచోటా దొరకును

ఆంధ్ర ప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు

M/s. శివకోటి లక్ష్మినరశింహం,

మార్కెట్ స్క్వేయర్ :: విజయవాడ


మీ
శిరోజాలు
అంత మనో
హరంగావుండ
వలెనని మీ కోరిక!




కేష




OINTMENT
Germex
WITH
CHLOROPHYLL
FOR SKIN DISEASES
FOR EXTERNAL USE




OINTMENT
Germex
WITH
CHLOROPHYLL
FOR SKIN DISEASES
FOR EXTERNAL USE


ESTD-1895
LITTLE'S
QUALITY PRODUCTS

# పాఠకుల లేఖలు

## జూన్ 1961

మే నెల "చందమామ" లో రామాయణ కథ ఒక ప్రత్యేకాకర్షణ. "మర్రిచెట్టు సాక్ష్యం" వంటి యుక్తితో కూడిన కథలు విరివిగా ప్రచురించి బాలబాలికలను యుక్తిపరులుగా "చందమామ" చేస్తుందని నా ఆశ.

—క్రోసూరు నాగేశ్వరరావు, చింతలపూడి.

"చీకటి భూతం" ఈ నెల యుత్తమ కథగా ఎన్నుకోవచ్చు.

—జొన్నా వీరాస్వామి, తలమంచి.

రెండు మూడు మాసములనుంచి అట్టమీద బొమ్మ బాగుండటం లేదు. చిత్రగారి బొమ్మలు "చందమామ" కు వింతసోయగాన్ని చేకూర్చుచున్న వనడంలో అతిశయోక్తి లేదు. కథలు చాలా చక్కగా ఉంటున్నాయి.

—శ్రీదేవి, తేలప్రోలు.

మే నెల "చందమామ" చదువుతుంటే ఒడలు మరచి హరికథ కాలక్షేపము చేసినట్లు రాత్రంతయు చదివితిని.

—ఎస్. జి. మహబూబ్ అలీ, రేణిగుంట.

"చందమామ" చదవటం ఇదే మొదటిసారి. తొలి పరిచయంతోనే ఆనందాన్ని కల్గించినందుకు అభినందిస్తున్నాను "కళ్ళువిప్పిన యువరాజు" చాలా బాగున్నది "రామాయణం" ప్రచురిస్తున్నందుకు ఎంతో సంతోషం.

—జి. కస్తూరిబాల, భీమవరం.

ఈ నెల "చందమామ" నాకెంతో బాగుంది. రామాయణానికి శ్రీ శంకర్‌గారు వేసిన త్రివర్ణ చిత్రాలు చాలా బాగున్నయ్.

—బలిజేపల్లి వెంకాజీరావు, రామభద్రపురం.

మొదటి తారీకు నుండి "చందమామ" దొరికే వరకు షాపుకూ, ఇంటికీ రోజూ తిరుగుతూ యుంటాను. "చందమామ" రాగానే కొని చదివి కొంచెముకూడా నలగకుండ జాగ్రత్తగా నా పుస్తకాల బీరువాలో దాచుకొంటాను. నా "చందమామ"లు, 3, 4, ఏళ్ళ క్రిందటివికూడ ఇప్పుడు తెచ్చిన పుస్తకాలవలె కొత్తగానున్నవి

—శెట్టి వెంకటనాగభూషణరావు,
విశాఖపట్నం.

"దేవతల పక్షపాతం", "విష ఫలం", "రాక్షస ముద్రిక" చాల బాగున్నవి. అట్టమీద బొమ్మ ఎంత చూసినా తనివి తిరుటలేదు.

—జి. ఎల్. శారద, రాజమండ్రి.

మే సంచిక ముఖ చిత్రం చూద్దునుగదా, శివాజీ గణేశన్, పంగర, హెలెన్ ప్రత్యక్షమయారు. బేతాళ కల్పిత కథకు పేరు తగిందిగాలేదు.

—తిరుమల్ల వెంకటనారాయణ,
కమలాపురం.



## చూడండి, రహస్యము ఏమిటంటే... అందరూ టినోపాల్ వాడుతున్నారు!

మీ బట్టల మాటేమిటి? మీ తెల్ల నూలు మరియు రేయాన్ బట్టలకు టినోపాల్ పెడతారా? తెల్ల బట్టలను ఊరికే ఉతికితే సరిపోదు. మీరు వాటిని ఉతికిన తరువాత కొంచెము టినోపాల్ కలిపిన నీళ్లలో ముంచి తీస్తే ఎంత తేడా వస్తుందో చూడండి! మీ చాకలితో కూడ దానిని వాడమని చెప్పండి! టినోపాల్ ఎంతో పొదుపుచేకూరుస్తుంది ఇంట్లో అందరి బట్టలు ఉతుకునపుడు కొంచెము వాడితే చాలును. దానిని నేడే కొనండి!







టినోపాల్ జె. ఆర్. గెయిగి. ఎస్. ఎ. బస్లె. స్విట్జర్లెండ్ వారి రిజిష్టరు చేయబడిన ట్రేడు మార్కు.

కొంచెము

# టినోపాల్

తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును

తయారుచేయువారు
సుహృద్ గెయిగి లిమిటెడ్
వాడి వాడి బరోడా

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు :
సుహృద్ గెయిగి ట్రేడింగ్ లిమిటెడ్ పి. ఒ. బాక్స్ నెం. 965, బొంబాయి 1

SISTA'S-SG-137-TEL

## 'చందమామ' కు

★

ఏజంట్లు లేని ప్రతి ఊరిలోనూ చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్దికాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

★

చందమామ పబ్లికేషన్సు,
వడపళని, మద్రాసు - 26

భారతదేశంలో అత్యధికముగా అమ్ముడుపోతున్నాయి...




Ravalgaon

అమ్మకపు ఏజెంట్లు : మెస్సర్స్. మోతిలాల్ గిర్‌ధారిలాల్ అహూర్‌కర్, మాలెగావ్, జిల్లా : నాసిక్



'నేను ఇప్పుడే ఆమె
దుస్తులు మార్చాను
-ఇప్పుడు ఆమె కేసి చూడండి!'

ఇంకొసయుం, ఆమె బట్టల నెలా శుభ్రపర్చాలో నాకు తెలుసు—నా పిల్లలాటి బిడ్డలుంటే మీకూ ఆ విషయం తెలిసి యుండాలి!

'సన్‌లైట్ నా బట్టలను తెల్లగాను, కాంతిగాను-పరిశుభ్రంగాను ఉతుకుతున్నదని నేను చెప్పక తప్పదు. అంతేగాక, సన్‌లైట్ నాకు కావలసినంత నురగ నిస్తుంది దానితో ఉతుక్కోవడం నాకెంతో సులభం! నా మాట నమ్మండి, నాకు ఏదీ సన్‌లైట్‌కంటె మంచి సబ్బు కానవిపించింది !'

ఈమె బొంబాయి, బాంద్రా లోనున్న నం. 2 మే ఫేర్ భవనమందున్న శ్రీమతి అత్మారామ్, తన బట్టలను శుద్ధమైన, సౌమ్యమగు సన్‌లైట్‌తో ఉతుక్కుంటుంది. మీ బట్టలను కూడా సన్‌లైట్ తోనే కాపాడుకోండి.

# సన్‌లైట్




*మీ బట్టలకు వరప్రసాదం!*

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S.29-X29 TL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

---

ఈ సంచికతో సంస్కృత నాటక కథల శీర్షికను ముగింపు చేస్తున్నాము. ఉత్తమ సంస్కృత నాటకాలలో చాలావరకు "చందమామ" పాఠకులకు అందించి ఆనందం చేకూర్చ గలిగినందుకు సంతోషిస్తున్నాము.

ఇకనుంచీ అట్టమీది బొమ్మలు "రామాయణం" సంబంధించి ఉంటాయి. వీటిని శ్రీ వడ్డాది పాపయ్య చిత్రిస్తున్నారు.

ఈ సంచికతో "జ్వాలాద్వీపం" ముగుస్తున్నది. అలాగే శ్రీ ఉత్పలవారి "శమంతకమణి" కూడా ముగుస్తున్నది. ఈ శీర్షికలపట్ల పాఠకులు చూపిన ఆదరాభిమానాలకు ఎంతైనా కృతజ్ఞులం. పై సంచిక నుంచీ వీటి స్థానే ఇలాటివే మరి రెండు శీర్షికలు ప్రారంభం కాగలవు.

---

సంపుటి 28 : జూన్ 1961 : సంచిక 6



# మహిమగల కావడిబద్ద

హిమాలయ పర్వతాలలో మానస సరస్సు సమీపంలో ఉండే పచ్చికబయలులో ఒక గ్రామంవాళ్ళు తమ ఆవులను మేపుకుంటూ ఉండేవారు. ఆవులను కాసేవాళ్ళు ఉదయమూ సాయంకాలమూ తమ ఆవులను లెక్కపెట్టుకుంటే లెక్క సరిగానే ఉండేది; కాని ఈ మధ్యకాలంలో ఎవరైనా పని పెట్టుకుని లెక్కపెడితే ఒక ఆవు ఎక్కువ ఉన్నట్టుండేది.

ఇందుకు కారణంఉండేది. అదేమంటే, రోజూ కామధేనువు అదే బీడు మీదికి వచ్చి మిగిలిన ఆవులతోపాటు మేత మేసేది. అయితే కామధేనువు రావటంగాని, పోవటం గాని చూసినవారులేరు.

ఆ కారణంవల్ల ఆవులన్నీ పచ్చిక బయలులో మేసేటప్పుడు అదనంగా కనిపించే ఆవు కామధేనువని కాపలావాళ్ళ కెవరికీ తెలియదు.

ఆ సమీపంలోనే ఒక గ్రామంలో ఒక ముసలివాడు ఉండేవాడు. వాడు రోజూ మధ్యాన్నంవేళ కావడిబద్ద భుజాన వేసుకుని అడవిలోకి వెళ్ళేవాడు. అక్కడ ఎండు చితుకులు ఏరి, మోపులు కట్టి, మోయ గలిగినమట్టుకు కావడిబద్ద రెండు చివరలా తగిలించుకుని గ్రామానికి తెచ్చి, వాటిని అమ్మి సంసారం గడుపుకునేవాడు. కాని, పాపం, ఆ డబ్బు వాడికి చాలీ చాలకుండా ఉండేది.

ఒకనాడు ఈ పేదవాడు అడివికేసి వెళు తూండగా దారికి అడ్డంగా ఆవులు మేత మేస్తూ కనబడ్డాయి. వాడు తన కావడి బద్దతో వాటిని అదిలిస్తూ దారి చేసుకుని ముందుకు వెళ్ళాడు. ఇలా వెళ్ళటంలో కావడిబద్దకు కామధేనువు రోమాలు తగిలి, అది పాతది కావటంవల్ల దాని పగుళ్లలో కొద్దిగా ఇరుక్కున్నాయి.

జి. నాగరాజు

తాను కామధేనువును అదిలించిన సంగతిగాని, దాని రోమాలు తన కావడి బద్దలో ఇరుక్కున్న సంగతిగాని వాడికి తెలియదు. వాడు మామూలు ప్రకారమే చితుకులు మోపులు కట్టి కావడిబద్దకు తగిలించి భుజాని కెత్తుకుంటే కావడి అంతా కలిసికూడా కాకి ఈక అంత బరువు లేదనిపించింది.

ముసలివాడు ఆశ్చర్యపడి మరిన్ని చితుకులు మోపులు కట్టి కావడికి రెండు వేపులా వేశాడు.

అప్పటికీ కావడికి కట్టిన బరువు కాకి ఈకంతే ఉన్నది!

ముసలివాడికి ఆశ్చర్యంతోబాటు ఆనందంకూడా కలిగింది. వాడు చితుకులను తన భుజం ఎత్తు మోపులుగా కట్టి కావడిబద్దకు ముందూ వెనకా తగిలించి, సునాయాసంగా వాటిని మోసుకుంటూ గ్రామానికి వెళ్ళాడు.

చితుకులు అమ్మగా ముసలివాడికి మామూలుకు నాలుగింతలు డబ్బువచ్చింది. ఆ విధంగా వాడి ఇంటి ఖర్చులన్నీపోగా కొంత డబ్బు మిగిలింది.

ఆరోజు లగాయతు ముసలివాడు రోజూ ఆ కావడిబద్ద ధర్మమా అంటూ అంతులేని చితుకులను అవలీలగా గ్రామానికి



మోసుకు వచ్చి, వాటిని అమ్మి సుఖంగా కాలక్షేపం చెయ్యసాగాడు.

ఒకనాడు ముసలాడు కావడితో వస్తుండగా ఒక ధనికుడు ఎదురై, "అబ్బో, ఇంత బరువు మోసేవాడు ఎంత బలశాలి అయిఉంటాడో!" అనుకున్నాడు. కాని తీరా దగ్గిరిగా చూస్తే కావడి మోసేవాడు ముసలివాడు.

"ఏమిరా, ముసలీ? ఈ యీడుకు ఇంత బరువు మోస్తున్నావుగా!" అన్నాడు ధనికుడు.

"నాదేముంది, బాబయ్యా. నేనిందులో నాలుగో వంతు మొయ్యగలుగుదునా! అ మహిమంతా కావడిబద్దది!" అన్నాడు ముసలివాడు.

ధనికుడు నమ్మలేదు. తాను స్వయంగా కావడి ఎత్తి చూశాడు. ఒక్క వేలుతో ఎత్తితేచాలు కావడి సునాయాసంగా పైకి లేస్తున్నది. "ముసలాడా! మాకు నీళ్లు మోసేవాడు చస్తున్నాడు. ఈ కావడిబద్ద అమ్ముతావా? మూడువందల మాడ లిస్తాను," అన్నాడు ధనికుడు.

ముసలివాడు మొదట ఇవ్వనన్నాడు గాని తరవాత సరేనన్నాడు. ఎందుకంటే మూడు వందలతో తాను బతికున్నన్నాళ్లూ కడుపులో చల్ల కదలకుండా జీవించ వచ్చు. వాడు ఊళ్లో చితుకులు అమ్మి, కావడిబద్ద ధనికుడి కిచ్చి, డబ్బు పుచ్చుకున్నాడు.

ధనికుడు అ కావడిబద్దను ఇంటికి తీసుకుపోతూ పరీక్షగా చూస్తే అది చాలా పాతదిగా కనిపించింది, అక్కడక్కడా పేడురేగి ఉన్నది. అందుచేత అయన దారిలో వడ్రంగిచేత సన్నగా చిత్రిక పట్టించి, నున్నగానూ, నాజూకుగానూ చేయించి ఇంటికి తీసుకుపోయాడు.

కాని వండ్రంగి చిత్రిక తగులుతూనే కామధేనువు రోమాలుపోయి అది మామూలు కావడిబద్ద అయిపోయింది.





# శమంతకమణి

షష్ఠాశ్వాసము

శతధన్వుని పోకడ విని
సత్వరముగ శ్రీకృష్ణుడు
బలరాముడు రథమునెక్కి
బయలుదేఱి వెంటబడిరి.

శతధన్వుని హయము ముందు
అతి రయమున పోచున్నది!
రివ్వున ఒక చుక్కవోలె
రేచితగతి పోచున్నది!

ధనధనమని కృష్ణు రథము
తఱుముకొనుచు వచ్చుచుండె.
శతధన్వుని గుండెలలో
గతుకు గతుకు మనుచుండెను!

గుఱ్ఱ మింక నడువలేక
గుండె పగిలి చనిపోయెను
భయపడి శతధన్వు డపుడు
పాదచారియై పోయెను.

అదె మిథిలా నగర మింక
పది కోసులలో నున్నది.
శతధన్వుని ఈ లోననె
చంపుదునని శ్రీకృష్ణుడు—

రథము డిగ్గి వానివెంట
రభసమ్మున పరుగెత్తెను
ఆత డపుడు రాళ్ళు విసరి
అతి రయమున చనుచుండెను.

అంతట శ్రీకృష్ణమూర్తి
ఆగ్రహించి ఉగ్రుండయి
చక్రాయుధ మెత్తివేసి
శతధన్వుని తెగటార్చెను.

చచ్చిన శతధన్వుకడకు
వచ్చిచూచి వెదకినాడు
అంతట పరికించినాడు
ఆ మణి కనిపించలేదు.

ఉత్పల సత్యనారాయణాచార్య

అంతలోన బలరాముడు
ఆయెడ కరుదెంచుచుండ
శ్రీకృష్ణుం డెదురు పోయి
చింతించుచు ఇట్లు చెప్పె :

"మన ప్రయాస విఫలమయ్యె
మణిమాత్రము దొరకదయ్యె
శతధన్వుని వ్యర్థముగా
చంపినవారల మైతిమి."

అని చెప్పగ బలరాముడు
ఆ మాటలు నమ్మలేదు
అర్థతృష్ణ ఘనునైనను
అల్పుని గావింప గలదు!

"మణి నిమ్మని నిన్నడుగను
మాయ పణిచెదేల నన్ను?
నీ సంగతి మొదటినుండి
నే నెఱుగనివాడ గాను."

అని పల్కుచు బలరాముడు
జనకరాజు జూచెదనని
మిథిలకేగె — శ్రీకృష్ణుడు
వ్యథచెందుచు ఇంటికేగె.

జనకునిచే బలరాముడు
సత్కారము లందినాడు
కొంతకాల మచ్చటనే
సంతసమున గడపినాడు.

అది యదనని సుయోధనుడు
గదాయుద్ధమును నేర్వగ
బలరాముని కడకు వచ్చి
భక్తితోడ కొలువసాగె.

అచ్చట నా ద్వారకలో
అక్రూరుడు కృతవర్మయు
శతధన్వుని వధ నెఱింగి
చాల భయము చెందినారు!



ఎన్నడైన తమ కుట్రను
ఎఱుగ గలడు శ్రీకృష్ణుడు
అవులించి సంత లోన
ప్రేవులు లెక్కించు నతడు!

అని తలంచి కృతవర్మయు
హస్తిపురికి వెడలిపోయె,
అక్రూరుడు మణి గైకొని
అరుణాస్పద పురి కేగెను.

నాటినుండి ద్వారకలో
కాటక మారంభమాయె
వానచినుకు కఱవాయెను
వఱపున జన మల్లాడెను.

కఱవేర్పడుటకు కృష్ణుడు
కారణ మూహించుచుండ
కులవృద్ధుం డొకడు వచ్చి
గోవిందునితో ఇటులనె.

"దేవా! అక్రూరుడు మన
దేశంబును విడిచిపోయె
అందువలన మనకు ఇట్టి
అరిష్టములు తటస్థించె.

అక్రూరుని పిలిపింపుడు
అతడుండిన దేశమందు
కఱవుకాటకములు రావు
వఱపుగూడ తొలగిపోవు."

అని పలికిన కృష్ణుడపుడు
అక్రూరుని పిలిపించెను
కులవృద్ధులు మిథిలకేగి
బలరాముని గొనివచ్చిరి.

అక్రూరుడు ద్వారవతికి
అరుదెఱగ దేశమందు
నెలకు మూడు వానలు పడి
తొలగిపోయె దుర్భిక్షము.






## 18

[ జ్వాలాద్వీపం నుంచి ఉగ్రదత్తుడు తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడికి సహాయం రావలసిందిగా వార్త పంపాడు. వెంటనే ఉగ్రాక్షుడు తన రాక్షసబంట్లతో పడవలమీద జ్వాలాద్వీపానికి బయలుదేరాడు. పడవలు ఒక పగలూ, రాత్రి ప్రయాణంచేసి సముద్ర మధ్యంలో వుండగా, ఒక భయంకరపక్షి వాళ్ళమీద దాడిచేసేందుకు వచ్చింది. తరవాత—]

భయంకరపక్షిని చూస్తూనే రాక్షసులు హడలెత్తిపోయారు. ఉగ్రాక్షుడు ఉరుము లాంటి పెద్ద గొంతుతో, "కాగడాలను చమురులో తడిపి, వెలిగించండి!" అని కేకపెట్టాడు. వెంటనే రాక్షసులు కాగడాలు వెలిగించారు. భయంకర పక్షి మీదవున్న రౌతులు ఆకాశంలో అంత ఎత్తున ఎగురుతూనే, పడవల మీదవున్న రాక్షసుల మీదికి ఈటెలూ, పెద్దపెద్ద రాళ్లూ విసరసాగారు. ఈవిధంగా ఓ పావుగంట కాలం పోరాటం జరిగిన తరవాత భయంకరపక్షి మీద వున్న పులిరాయుళ్లు, పడవలమీద దిగబోతున్న వాళ్ళలా పక్షిని సూటిగా కిందికి దూకించి, అంతలోనే పైకి ఎగిరిపోతూ కొంతసేపు అట్టహాసంచేసి, చివరకు జ్వాలాద్వీపం దిక్కుగా వెళ్లిపోయారు.

ఏ కారణంవల్లనో ఆ పగలూ, రాత్రికూడా పులిరాయుళ్లు మళ్లీ రాక్షసులమీద దాడికి రాలేదు. మూడవరోజు సూర్యోదయం అయే సరికి పడవలు జ్వాలాద్వీపాన్ని సమీపించినై.



"పడవల్ని మరికొంత దూరం పడమటి దిక్కుగా పోనివ్వండి. అక్కడ మండుతున్న రెండు అగ్నిపర్వతాల మధ్యగా ఒక లోయ వున్నది. ఆ ప్రాంతాన మనం తీరంచేరి, ఆ లోయకుండా ద్వీపం మధ్యకు వెళ్ల వచ్చు," అన్నాడు రాక్షసులకు దారిచూప వచ్చిన భల్లూకరాయుడు.

భల్లూకరాయుడు చెప్పినట్టే పడవలు తీరాన్ని అంటిపెట్టుకుని మరికొంచెం ముందుకు వెళ్లేసరికి, రెండు అగ్ని పర్వతాల మధ్యగా పాడవైన లోయ ఒకటి కనిపించింది. కాని, ఉగ్రాక్షుడూ, భల్లూకరాయుడూ ఆశించినట్టు లోయ నిర్మానుష్యంగా లేదు. లోయ ముఖద్వారాన్ని ఆక్రమించుకుని వున్న పులిరాయుళ్ళతో, భల్లూకరాయుళ్లు హోరాహోరి పోరాడుతున్నారు. కొన్ని భయంకర పక్షులు లోయకు చివరవున్న భల్లూకరాయుళ్ళమీద దాడి చేస్తున్నవి.

రాక్షసులందరూ పడవలు దిగి తీరం చేరేసరికి, పులిరాయుళ్లు లోయలో పోరా డుతూ భల్లూకరాయుళ్ల మధ్యగా దారి చేసుకుని ద్వీపం లోపలికి పారిపోసాగారు. భల్లూకరాయుళ్లు అందినవాళ్ళను అంది నట్టు చంపుతూ, రాక్షసులున్న చోటుకు చేరారు. అందరికన్న ముందున్న భల్లూక రాయుడొకణ్ణి చూస్తూనే, ఉగ్రాక్షుడు అదిరి పడి, "ఉగ్రదత్తా! ఏమిటీవేషం?" అంటూ అతడి చేతులు పట్టుకుని పైకెత్తి భుజంమీద కూర్చోపెట్టుకున్నాడు.

తమ ప్రబల శత్రువైన ఏకపాదుడితో పోరాడేందుకు రాక్షసులు సహాయం రావటం భల్లూకరాయుళ్ల కందరికీ ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. ఉగ్రదత్తుడు నాలుగు మాటల్లో శత్రుపక్ష బలాన్ని గురించి, తన పెంపుడు తండ్రితో చెప్పి, భల్లూకరాయుళ్ల నాయకుడైన కంథుణ్ణి పరిచయం చేస్తూ, "ఈయనే వీళ్ల నాయకుడు. నన్ను పులి రాయుళ్ళ నుంచి కాపాడాడు," అన్నాడు.



కంధుడు ఉగ్రాక్షుడికి ప్రణామం చేసి, "ఉగ్రాక్షా! నీ రాకవల్ల మాకు కొంత గుహల్లో, బిలాల్లో చీకటిబతుకు తప్పింది. ఏకపాదుడి వంటి మహాక్రూరుడు ఇంక పుట్టబోడు. కేవలం బానిసలు చేసే కాయ కష్టంమీద బతుకుతూ, ప్రపంచంమీద అధికారం చెలాయించాలని చూసే, ఏకపాదుణ్ణీ అతడి మిత్రులైన కరవీరడూ, నాగవర్మలను నాశనం చేయగలిగితే, మీ దేశానికి, ఈ జ్వాలాద్వీపానిక్కూడా ఎంతో క్షేమం కలుగుతుంది," అన్నాడు.

"దానికి అలశ్యం ఎందుకు? వాడి కోటను ముట్టడిద్దాం. మీరు దారి చూపితే చాలు," అన్నాడు ఉగ్రాక్షుడు, తన పెంపుడు కొడుకును భుజం మీదినుంచి దించుతూ.

"అది అంత తొందరపడి చేసే పనికాదు. ఆలోచిద్దాం. ఇప్పుడు వాడి చేతిలో చంద్రసేన అనే రాకుమార్తె వున్నది. ఆమెకు హాని కలక్కుండా చూడాలి. అంతేకాక, అరుద్రుడనే మీ వాడొకడు, ఎప్పుడూ వాణ్ణి అంటిపెట్టుకు తిరుగుతూ, మీ గుట్టుమట్లన్నీ వాడికి చెపుతున్నట్టు, అక్కణ్ణించి పారిపోయి వచ్చిన మీ దేశంవాళ్ళు చెపుతున్నారు," అన్నాడు కంధుడు.



అరుద్రుడు ద్రోహిగా మారాడని వింటూనే ఉగ్రాక్షుడు కళ్ళెర్ర చేసి, "రుద్రుడెక్కడ?" అని హుంకరించాడు.

రుద్రుడు భయపడుతూ అతడి ముందుకు వచ్చి నిలబడ్డాడు.

"ఏమిరా, అరుద్రుడు ఇంత ద్రోహి ఎలా అయాడు? వాడూ నీవూ ప్రాణస్నేహితులుగదా?" అని అడిగాడు ఉగ్రాక్షుడు.

"వాడికి నేనొక్కణ్ణే ఏమిటి, ఉగ్రదత్తుడు కూడా ప్రాణస్నేహితుడే! బహుశా, చంద్రసేనను పెళ్ళాడాలనే ఆశతో, వాడు మనకు ద్రోహం తలపెట్టి, పులిరాయుళ్ళ నాయకుడి




పక్షం అయివుంటాడు," అన్నాడు రుద్రుడు బెదురుగా.

"చంద్రసేన నా కొడుకును పెళ్ళాడ వలసిందే! దానికి తిరుగులేదు. ఆ అరుద్రుణ్ణి నరికి ఉప్పుపాతట్లో వేస్తాను," అంటూ ఉగ్రాక్షుడు రంకెలు పెట్టసాగాడు.

"శాంతించు, ఉగ్రాక్షా! ఇంతవరకూ నీకు చెప్పకుండా దాచిన రహస్యం ఒకటి వున్నది. ఏకపాదుణ్ణి చంపటం తేలికకాదు. వాడికోశక్తి వున్నది. వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—తప్పక మరణిస్తారు!" అన్నాడు కంధుడు నిస్పృహగా.



కంధుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు తికమక పడ్డాడు. అతడికి వెంటనే వాటి భావం అర్థం కాలేదు. కాని, ఆ అర్థం స్ఫురించగానే అతడు నివ్వెరపోయాడు. "కంధా, యిలాంటిది నేనెక్కడా వినలేదు. అయితే, ఆ ఏకపాదుణ్ణి నెత్తురు చిందించ కుండా చంపటం ఎలా?" అన్నాడు.

"మనలో కొందరు చావటానికి సిద్ధ పడాలి. కొండ శిఖరాన వున్న వాడి కోటలో జొరపడటం పెద్ద సమస్యకాదు. మనకూ కొన్ని భయంకరపక్షు లున్నవి గనక, శత్రువులు మనను వాటితో అడ్డగించలేరు. నీ బంట్లలో ఒక్కొక్కడు నూరుమంది పులి రాయుళ్లను అవలీలగా చుట్టచుట్టి దూరంగా పారవెయ్యగలడు. కాని, మనం కోటను వశపరుచుకుని, ఏకపాదుణ్ణి పట్టుకునేందుకు ప్రయత్నించటంలోనే ప్రమాదం వున్నది. వాడు కత్తితో శరీరం మీద కొన్ని గాట్లు పెట్టుకుని ఎదురయ్యాడంటే—మనం ప్రాణాలతో అక్కడినుంచి తిరిగి రాలేం," అన్నాడు కంధుడు.

"వాడు చాలా బలవంతుడుకాడానా?" అని అడిగాడు ఉగ్రాక్షుడు.

"బలవంతుడా, ఛీ, ఛీ! వట్టి అర్భకపు వెధవ, పైగా ఒంటికాలువాడు! చేతికి



దొరికితే పదేళ్ల కుర్రవాడు వాణ్ణి, కోట గోడల మీది నుంచి కిందికి దొర్లించవచ్చు," అన్నాడు కంధుడు.

"అయితే, నా బంట్లలో కొందరు చావటానికి సిద్ధపడతారు. మనం వాడి కోటలోకి వెళ్ళిం తరవాత, వాడు ఎక్కడ వున్నాడో చూస్తూ, ఒకడు ముందు నడుస్తూంటాడు. మనం అందరం తలలు ఎత్తకుండా నేల వంక చూస్తూ, వాడి వెనక నడుస్తాం. ముందున్నవాడు, ఆ దుర్మార్గుణ్ణి చూస్తూనే ఎక్కడవున్నదీ కేక పట్టి, చచ్చినా ఫరవా లేదు. మనం కళ్ళు మూసుకునేవాణ్ణి చుట్టుముట్టి, కళ్ళు మూసుకునేవాడి ప్రాణాలు తీద్దాం," అన్నాడు ఉగ్రాక్షుడు.

"ఆ తరవాత, మనం కళ్లు తెరవగానే రక్తం కనబడుతుందిగదా?" అని ప్రశ్నించాడు కంధుడు తల అడ్డంగా తిప్పుతూ.

"ఇది చాలా గడ్డు సమస్య! ఇక్కడ వుండి ఆలోచించలేం. వాణ్ణి చంపిన తరవాత అదంతా చూద్దాం. వాడి కోటకు దారి తీయండి," అంటూ ఉగ్రాక్షుడు చకచకా ముందు నడిచాడు.

భల్లూకరాయుళ్లు దారి చూపగా అందరూ లోయలో కొంతదూరం నడిచి, అక్కడ ఎడమపక్కగా కొండపాదంలో




వున్న ఎగుడు దిగుడు రాళ్ళమీదిగా ఎక్కి, శిఖరాన వున్న కోటకేసి పోసాగారు. ఆకాశంలో ఎక్కడా భయంకరపక్షుల జాడ గాని, కొండమీద పులిరాయుళ్ళ అచూకీ గానీ లేదు. అంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్నది.

"ఏకపాదుడేదో ఎత్తు వేశాడు! శరీరమంతా నెత్తురు చేసుకుని, హఠాత్తుగా వాడు కోట గోడమీద కనిపించి, మనను చంపాలని పథకం వేసివుంటొచ్చు," అన్నాడు కంధుడు.

"ముందు నడిచేవాడు తప్ప, తతిమ్మా వాళ్లెవరూ కోట గోడలకేసి చూడకండి!" అని ఉగ్రదత్తుడు కేకవేశాడు.





ఆ విధంగా అందరూ కోట గోడలను సమీపించేసరికి, వాటిమీద ఏదో కలకలం సాగింది. అయినా ఎవరూ తలలు ఎత్తలేదు. కొద్దిసేపటికల్లా గోడల మీది నుంచి ఏకపాదుడి గొంతు కంచులా మార్మోగింది: "ఇదుగో, అందరూ చూడండి! సుదర్శనుడి కుమార్తె చంద్రసేనను యింత ఎత్తునుంచి, కిందికి పడవేస్తున్నాను."

ఏకపాదుడి బెదిరింపు వింటూనే ఉగ్రాక్షుడితోపాటు అందరూ నివ్వెరపోయారు. కాని, ఎవరూ తలలు ఎత్తలేదు. ఇంతలో కోట గోడలమీది నుంచి, "ద్రోహం! మోసం!" అన్న అరుపూ, ఆ వెంటనే, "ఉగ్రదత్తా! చంద్రసేన జారవిడిచిన తాళ్ల ఆధారంతో పైకి రండి! ఏకపాదుణ్ణి, తోలు సంచీలో పెట్టి మూతి బిగించాను, భయం లేదు. కాని, ద్రోహి నాగవర్మా, కరవీరుడూ, ఈ ప్రాంతాన ఎక్కడో పొంచి వున్నారని నా భయం!" అంటూ అర్బుదుడు కేక పెట్టాడు. ఆ వెంటనే కత్తులు ఒక దాన్నొకటి తాకిన శబ్దమైంది. చంద్రసేన ఒక చేత్తో కత్తి పైకెత్తి, గోడ మీదినుంచి, "అర్బుదుడు కరవీరుడితో పోరాడుతున్నాడు. ఇడుగో, ద్రోహి నాగవర్మ!" అంటూ కోట లోపలి ఆవరణలోకి దూకింది.

ఉగ్రదత్తుడూ, ఉగ్రాక్షుడూ తమవాళ్లను హెచ్చరిస్తూ కేకలు పెట్టి, కోటగోడ నుంచి కిందికి చంద్రసేన జార్చిన తాళ్ళు పట్టుకుని గబగబా పైకి పాకారు. వాళ్ళు కోట ఆవరణలోకి దిగేసరికి, కరవీరుడితో అర్బుదుడూ, ద్రోహి నాగవర్మతో చంద్రసేనా కత్తియుద్ధం చేస్తున్నారు. ఉగ్రాక్షుడు ఆ దృశ్యం చూస్తూనే పొంగిపోయి, "ఇదుగో, వస్తున్నాను, చంద్రసేనా! క్షత్రియ కన్యవని పించుకున్నావు. నీ కాబోయే అత్తగారు లోగడ ఈవిధంగానే కత్తి దూసి మేనా దిగి, పులిరాయుళ్ళతో యుద్ధం చేయటం చూశాను!" అంటూ నాగవర్మకేసి రాతిగద

ఎత్తబోయేంతలో, వాడు చంద్రసేన విసిరిన కత్తి గుండెల్లో తగలగా, "అబ్బా!" అంటూ వెనక్కు పడిపోయాడు. రాకసుల్ని చూసి పారిపోబోయిన కరవీరుడి వెన్నులో ఆరుద్రుడి కత్తి దిగింది. వాడు "అమ్మా!" అంటూ ముందుకు పడిపోయాడు.

కంధుడు మహోత్సాహంతో ఏకపాదు డున్న తోలు సంచిని పైకెత్తి, "ఏకపాదా! లోపల ఉక్కగా వున్నదా? ఇదుగో, ఇప్పుడే నిన్ను ఆ మండే అగ్ని పర్వత ముఖంలో జార విడుస్తాను! నీకూ, లోకానిక్కూడా హాయిగా వుంటుంది," అంటూ దాపులనే వున్న అగ్నిపర్వతంకేసి పరిగెత్తాడు.

"నేను, మీపట్ల ద్రోహిగా నటించబట్టే, ఏకపాదుడు నన్ను నమ్మాడు. చంద్రసేనకు ప్రాణాపాయం కలగనున్నదని బెదిరించి, మీరు కోట గోడలకేసి చూడగానే, తన శరీరంమీద గాట్లు పెట్టుకుని మిమ్మ ల్నందర్నీ చంపాలని వాడు చూశాడు. ఇలాంటి అవకాశంకోసమే ఎదురు చూస్తున్న నేను, వెనక నుంచి మీదపడి, వాణ్ణి తోలు సంచీలో పెట్టి మూతి బిగించాను," అన్నాడు ఆరుద్రుడు. అతడి తెలివితేటల్ని అందరూ మెచ్చుకున్నారు.

* * *

ఉగ్రాక్షుడూ, ఉగ్రదత్తుడూ, చంద్రసేనా తమ పరివారంతో కలిసి తమ దేశం చేరగానే, చిత్రసేనుడూ, సామంతరాజు సుదర్శనుడూ పొందిన ఆనందం అంతా యింతా కాదు. ఒక శుభముహూర్తాన ఉగ్రదత్తుడికీ, చంద్రసేనకూ వైభవంగా వివాహం జరిగింది.

ఆ వివాహానికి కంధుడు వెలలేని కానుకలు తీసుకుని, కపిలపురానికి వచ్చాడు.

ఉగ్రదత్తుడు తన మామగారి సామంత రాజ్యానికీ, తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడి అరణ్యసీమకూ రాజై చాలా కాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు.

—(అయిపోయింది)





# గర్వభంగం

పూర్వం హిమాచల ప్రాంతంలో ఒక బల వంతుడైన రాజుండేవాడు. అక్కడి జన సామాన్యం అతి పేదవాళ్ళు.

ఆ ప్రాంతంలో ఒక ఐంద్రజాలికుడుండే వాడు. వాడు తన ఇంద్రజాలంతో తన సాటి వారికి వినోదమూ, ఆనందమూ కలిగిస్తూండే వాడు. వాడు కలిగించే భ్రమల మూలంగా కష్టజీవులకు రాజోచితమైన విందుభోజ నాలు చేసినట్టూ, నందనవనంలో విహారాలు చేసినట్టూ, అప్సరసలు తమ్ము వరించినట్టూ తోచి తాత్కాలికంగా కొంత ఆనందం కలి గేది. పెళ్ళి చేసుకునేటందుకూ, భార్యాబిడ్డ లను పోషించుకునేటందుకూ శక్తి లేనివాళ్లు ఇంద్రజాల మహిమవల్ల తాము సంసారాలు చేస్తున్నట్టు భ్రమపడి కొంచెంసేపుపాటు ఆ ఆనందం అనుభవించే వాళ్ళు.

ఐంద్రజాలికుడి పేరు రాజుగారి దాకా వెళ్ళింది. ఆయన ఒక రోజు అతన్ని పిలి పించి, "నీ వద్ద గొప్ప ఇంద్రజాలవిద్య ఉన్న దట. నాకుకూడా చూపించు," అన్నాడు.

"మహాప్రభూ, నా విద్య పామరులకోసం గాని తమ వంటి వారికి కాదు," అన్నాడు ఐంద్రజాలికుడు.

"అదేదో నన్నుకూడా చూడనీ. నేనే అడుగుతున్నాను గద, నీ కింకా సంకోచం ఎందుకు?" అన్నాడు రాజు.

"నాకు తమరు అభయపత్రం రాసి ఇస్తే తరవాత నా విద్య తమకు చూపిస్తాను," అన్నాడు ఐంద్రజాలికుడు.

రాజు ఆ ప్రకారమే ప్రతం రాసి దానిపై సంతకం చేస్తూండగా రాజభవనం వెలపల నుంచి జనం కలకలమూ, గుర్రాల సకి లింపులూ వినిపించాయి. రాజు కిటికీలో నుంచి చూసేసరికి తన భవనంచుట్టూ గల వీడులో ఒక పక్కగా ఎవరో మనుషులు గడ్డికోస్తూ కనిపించారు.

బి. నారాయణరావు



"అనుమతి లేకుండా గడ్డి కోసుకునే ఆ దుర్మార్గులనూ, వాళ్ల గుర్రాలనూ పట్టి జరజరా ఈడ్చుకురండి," అని ఆయన తన భటులను ఆజ్ఞాపించాడు.

రాజభటులు బయటికి వెళ్లేసరికి బయటి మైదానంమీద వేలాదిజనం, ఏవేవో పనులలో నిమగ్నులై కనిపించారు. అంతటా డేరాలు వేసిఉన్నాయి. ఆ ప్రాంతమంతా సైనిక శిబిరం లాగున్నది. ఒక పెద్ద డేరా ముందు ఒక బంగారు సింహాసనమూ, ఒక వెండి సింహాసనమూ వేసిఉన్నాయి.

ఇదంతా చూసేసరికి రాజభటులకు కంపరం పుట్టింది. వాళ్లు తమకేసి వచ్చే నీళ్ల కావడివాణ్ణి ఎంతో మర్యాదగా, "అయ్యా, మీరంతా ఎవరు? ఏం పనిమీద దయచేశారు?" అని అడిగారు.

"మేమందరమూ పాతాళలోకం నుంచి వస్తున్నాం. నాగరాజుగారి పరివారం. అదుగో, ఆ కనపడే సింహాసనాలు పాతాళ రాజుగారిదీ, ఆయన కుమారుడిదీనూ," అన్నాడు నీళ్లకావడివాడు.

భటులు ఈ వార్తను రాజుకు నివేదించారు. రాజు విస్మయంచెంది, "నాగ రాజుగారే దయచేశారా? అయితే అవశ్యం వెళ్లి ఆయన దర్శనం చేసుకోవాలి. నా ప్రజలు ఆయనను పూజిస్తారు, పిల్లలకు ఆయన పేరు పెట్టుకుంటారు," అనుకుని, మంచి మంచి కానుకలు వెంట పట్టించుకుని తన పరివారంతో పెద్ద డేరా వద్దకు వచ్చాడు. ఇప్పుడా డేరా ముందు సింహాసనాలలో పాతాళరాజూ, ఆయన కొడుకూ కూచుని ఉన్నారు. రాజుగారు నాగరాజు ముందు సాష్టాంగపడి, "ఓ పాతాళలోకేశ్వరా! తమరు ఏమి పనిమీద మా ప్రాంతాన్ని పావనం చేయ వచ్చారు?" అని అడిగాడు.

దానికి నాగరాజు ఇలా చెప్పాడు:

"నేను మా తోటలో ఒక ఫలవృక్షం నాటి ఎంతో శ్రద్ధగా పెంచాను. అది పెరిగి

పెరిగి స్వర్గలోకందాకా ఎదిగి అక్కడ కొమ్మలు వేసింది. ఇప్పుడా చెట్టు కాపుకు వచ్చింది. దాని పళ్ళను దేవతలు ఆరగించేస్తున్నారు, నాకు ఒక్కటీ దక్కటంలేదు. ఆ పళ్ళలో నాకు సగంభాగం ఇవ్వమని అడగటానికి బయలుదేరి పోతూ ఇక్కడ మజిలీ చేశాను."

ఈ మాటలు వినేసరికి రాజుకు పరమానందం కలిగింది. నాగరాజు తన ఇంటి పరిసరాలలో మజిలీ చెయ్యటమే ఒక మహాభాగ్యం. ఈ అవకాశాన్ని మరింత బాగా ఉపయోగించు కుందామనే ఉద్దేశంతో రాజు, "ఓ పాతాళ లోకేశ్వరా! మనమూ మనమూ రాజులము. తమకొక కొడుకున్నాడు. నాకు చక్కని చుక్కలాటి కూతురున్నది. వీరిద్దరికి వివాహం జరిపినట్టయితే ఉభయపక్షాలకూ ఎంతో లాభం! ఏమంటారు?" అన్నాడు నాగరాజుతో ఎంతో వినయం కనబరుస్తూ.

ఇందుకు నాగరాజు సమ్మతించి ఇలా అన్నాడు: "అలా అయే పక్షంలో నేను నా కుమారుణ్ణి మీ వద్దనే విడిచి స్వర్గానికి వెళతాను. ఎందుకంటే దేవతలు నా మాటలు వినిపించుకోక అహంకరించినట్టయితే యుద్ధంకూడా జరగవచ్చు. వీడు మీ వద్ద ఉండటమే క్షేమం. నేను తిరిగి






వచ్చేదాకా ఆకాశంకేసి ఒక కన్ను ఉంచండి."

తరవాత నాగరాజు తన పరివారంతోసహా వెళ్ళిపోయాడు. రాజుగారు తన కాబోయే అల్లుణ్ణి తన భవనానికి తెచ్చేసుకున్నాడు.

కొద్ది రోజులయాక ఆకాశంనిండా మబ్బులు కమ్మాయి. ఉరుములూ మెరుపులూ సాగాయి. ఆ మబ్బుల వెనక నుంచి శవాలూ, తెగిన చేతులూ, కాళ్లూ, తలలూ, మొండాలూ పడసాగాయి. జనం గాభరా పడిపోయారు.

ఇంతలో ఒక శిరస్సు తెగి పడింది. అది నాగరాజు శిరస్సేననటానికి సందేహం ఏమీ లేదు. రాజుగారు కంగారుపడ్డాడు. దేవతలు నాగరాజును యుద్ధంలో పరిమార్చారు. కాని ఈ సంగతి తన కాబోయే అల్లుడికి తెలిస్తే బావురుమంటాడు. అందుచేత రాజుగారు ఇంటి వెలపల మైదానంలో చితిపేర్పించి, అందులో నాగరాజు శిరస్సు దహనం చేయించాడు.

నాగరాజు కొడుకు రాజభవనపు కిటికీ లోనుంచి బయటికి చూసి, "ఆ మంటలేమిటి?" అని అడిగాడు. అమాయకురాలైన దాసీది ఆ ప్రశ్న విని, "మీ కివేవీ తెలియదా? దేవతలు మీ నాన్నగారి శిరస్సు నరికి కింద పడేశారు. దాన్ని మా రాజుగారు దహనం చేయిస్తున్నారు," అన్నది.

ఈ మాట వింటూనే నాగరాజు కొడుకు బయటికి పరిగెత్తి ఆ మంటల్లో దూకి బూడిద అయిపోయాడు. అతన్ని ఆపటం ఎవరికీ సాధ్యంకాలేదు.

కొద్దిరోజులు గడిచాయి. నాగరాజు స్వర్గం నుంచి సపరివారంగా తిరిగి వచ్చాడు. రాజుగారి గుండె ఆగిపోయినంత పని అయింది. కాళ్ళూ చేతులూ వణుకుతూ ఆయన నాగరాజు గుడారం వద్దకు వెళ్ళాడు.

"మొదట్లో ఆ దేవతలు నాకు వళ్ళలో వంతు ఇవ్వమనేశారు. నేనూరుకుంటానా?

యుద్ధం చేశాను. అంతలో మహేశ్వరుడు వేంచేసి మాకూ మాకూ రాజీ చేసేశాడు. ఆ మీదట వాళ్లు నాకు పల్లెలో సగం ఇవ్వ టానికి ఒప్పుకున్నారు... అన్నట్టు, నాకొడుకు ఏడీ? నన్ను చూడటానికి మీ వెంట వాడు కూడా రాలేదేం?" అన్నాడు నాగరాజు చుట్టూ చూసి.

రాజుగారు చేతులు నులుముకుంటూ గద్గద కంఠంతో జరిగినదంతా ఆయనకు చెప్పుకున్నాడు.

అంతా విని నాగరాజు ఉగ్రుడైపోయి, నోట నురుగులు కక్కుతూ చివాలునలేచి, "ఏమిటీ అర్థంలేని మాటలు? నేను బతికే ఉంటిని గద! నిన్ను నమ్మి నా కొడుకును వదిలిపోతే వాణ్ణి చావనిస్తావా? వాడి ప్రాణా నికి నీ ప్రాణం పుచ్చుకుంటాను!" అని గర్జించాడు.

రాజు నేలపై సాష్టాంగపడి, "ఓ పాతాళ లోకేశ్వరా! శరణు! శరణు! మీ కుర్రవాడు ఎలాగూ చనిపోయాడు! నా ప్రాణం తీయ వద్దు! నాకున్న సర్వస్వమూ పుచ్చుకోండి! రక్షించండి! రక్షించండి!" అని ఏడ్చాడు.

"ఏమిటది? లే, లే! తల ఎత్తి నాకేసి చూడు!" అని నాగరాజు అనటం అతడికి వినిపించింది.

రాజు తల ఎత్తి చూశాడు. ఎవరూ లేరు. బీడు నిర్జనంగా ఉన్నది. రాజుకు ఎదురుగా ఒక ఎత్తయిన రాతిమీద ఇంద్రజాలికుడు కూచుని ఉన్నాడు.

ఈ జరిగినదంతా ఇంద్రజాలమేనని రాజు గ్రహించాడు. ఆయనకు పట్టరాని ఆగ్రహం వచ్చి వాణ్ణి హతమార్చాలనిపిం చింది. కాని వాడు అభయపత్రం ముందే పుచ్చుకుని ఉండటంచేత అతణ్ణి ఏమీ చెయ్యలేక పోయాడు.

అంత బలవంతుడైన రాజుగారి చేత సాష్టాంగం చేయించుకున్నందుకు ప్రజలు ఇంద్రజాలికుణ్ణి మరింతగా అభినందించారు.





# కళ్ళువిప్పిన యువరాజు

## 2

నింపాదిగా మహామంత్రి బండి క్రీడోద్యానం చేరుకున్నది. ఈ ఉద్యానం ఊరికి దూరంగా ఒక సరస్సు మధ్య చాలా మనోహరంగా నిర్మించబడి ఉన్నది. దానిని చేరుకోవటానికి ఒక వంతెన ఉన్నది. ఉద్యానం మధ్య అతి సుందరమైన క్రీడాభవనం ఉన్నది. ఆ చీకటిరాత్రి ఆ భవనం రంగురంగుల దీపాలతో మెరిసిపోతున్నది. క్రీడాభవనం చుట్టూ పూపొదలూ, పొదరిళ్లూ అందంగా అమర్చబడి ఉండటంచేత ఆ ప్రదేశం స్వర్గాన్ని మరిపించేలాగున్నది.

మహామంత్రి బండి వంతెన దాటి క్రీడాభవనాన్ని చేరబోయే సమయంలో సుందరుడు బండి వెనకనుంచి దిగి పొదలచాటున చేరాడు. కొందరు వ్యక్తులు వచ్చి మహామంత్రికి భక్తితో స్వాగతం చెప్పారు. వారందరూ యౌవనవతులైన స్త్రీలేననీ, ఆ ప్రాంతంలో పురుష లెవరూలేరనీ అతను గమనించాడు. చివరకు కత్తులు బట్టి రక్షకభటులుగా పనిచేస్తూ పహరా ఇస్తున్నవారుకూడా స్త్రీలే.

మహామంత్రి దిగగానే ముఖ్యమంత్రిని తీసుకుని బండి తిరిగి వెళ్ళిపోయింది. మహామంత్రి భవనంలోకి వెళ్ళి కూచుని, దాసీలు అందించిన పానీయాలు పుచ్చుకుని, "మహారాణిని తీసుకురండి," అని అజ్ఞాపించాడు. కొందరు స్త్రీలు ఒక పల్లకి తీసుకుని బయులుదేరారు. మరి కొంతసేపటికి వారు ఒక స్త్రీని పల్లకీలో తెచ్చి భవనం వెలపల దించారు. ఆమెపై వెలుగు పడగానే సుందరుడు ఆమెను పోల్చుకుని దిగ్భ్రమ చెందాడు. ఆమె మరెవరో కాదు, అతని భార్యే!

మహామంత్రి పరమానందంతో బయటికి వచ్చి ఆమెను చెయ్యి పట్టుకుని లోపలికి

సి. మాధవరావు



తీసుకుపోయాడు. వాళ్ళు లోపల ఏం మాట్లాడుకుంటారో వినాలని సుందరుడికి ప్రబలమైన కోరిక కలిగింది. సమీపంలో పహరా స్త్రీ లెవరూ లేకపోవటం చూసి, అతను భవనానికి దగ్గిరిగా ఉన్న పూ పొద లలో చేరి అక్కడ వున్న కిటికీలో నుంచి లోపలికి తొంగి చూశాడు.

మహామంత్రి, మాయావి అయిన తన భార్యా ఒక సోఫాపైన కూచుని మట్లాడు కుంటున్నారు.

"మీ మనుషులంతా ఏం చేస్తున్నారు? ఇవాళ ఉదయం ఆ సుందరుడు నిర్భయంగా ఊరంతా తిరిగివస్తే ప్రాణాలతో ఎందుకు పోనిచ్చారు? అ తాత పులిలాగా నన్ను కని పెట్టి ఉండకపోతే అతనికి ఏనాడో విషం పెట్టి ఉండేదాన్ని. ప్రతిరోజూ తాటి నిచ్చెన దిగిరాలేక నా ప్రాణం పోతున్నది! అ తాటి నిచ్చెనను నా కన్న ముందు మరెవరో ఇవాళ ఉపయోగించారు. నాకీ అగచాట్లు ఇంకెంత కాలం?" అన్నది సుందరుడి భార్య.

"ఇంకొక్క వారం ఆగు. మన సమస్య లన్నీ తీరిపోతాయి," అంటూ మహామంత్రి లేచాడు. ఆమెకూడా లేచింది. వారిద్దరూ లోపలి గదిలోకి వెళ్ళిపోయారు.

"ఓరి దుర్మార్గుడా! ఇలాటి భార్యనా నాకు కట్టబెట్టావు? తాత నిజంగా ఎంత దూరాలోచనగలవాడు! నన్నూ నా భార్యనూ వేరు చేసి ఉంచాడని నేను చిరాకు పడటం ఎంత పొరపాటు!" అనుకుంటూ సుంద రుడు పరధ్యానంగా తాను పొంచి ఉన్న చోటనే లేచి నిలబడ్డాడు. లోపలి దీపాల వెలుగు సుందరుడి ముఖాన పడింది.

"ఎవరువారు?" అని ఖంగున ఒక స్త్రీ కంఠం ప్రశ్నించింది. "పట్టుకోండి! చంపండి!" అని వేరువేరు ప్రాంతాలనుంచి అడ గొంతులు అరిచాయి. ఈ కేకలతో సుందరుడు తన అలోచనలను కట్టిపెట్టి, కాలి సత్తువకొద్దీ వంతెన కేసి పరిగెత్తాడు.



కొందరు స్త్రీలు అతన్ని తరుముకొచ్చారు. వారి చేతుల్లో దూసిన కత్తులున్నాయి. అయితే అదృష్టవశాత్తూ సుందరుడు వారికి అందకుండా వంతెన దాటగలిగాడు.

ఇంకా అతనికి క్రీడోద్యానం వేపునుంచి కేకలు వినిపిస్తూనే ఉన్నాయి. వాళ్ళు తనని ఇంత సులువుగా చెయ్యిదాటి పోనివ్వరు. అందుచేత సుందరుడు దాక్కునే చోటు కోసం చూస్తూ నగరంలోకి పరిగెత్తాడు.

నగరద్వారానికి కొద్దిదూరంలో ఒక సత్రం ఉన్నది. ఒకప్పుడది అన్నసత్రం. ముసలి రాజుగారి కాలంలో అక్కడ అడిగినవారికి లేదనకుండా అన్నదానం చేసేవారు. మహామంత్రి పరిపాలనలో ఆ ఏర్పాటు నిలిచిపోయింది. ఇప్పుడు దాన్ని ఇళ్ళులేని కూలివాళ్ళు, బీదా బిక్కీ రాత్రి వేళ నిద్రపోవటానికి ఉపయోగిస్తున్నారు.

సత్రం అరుగులమీద కొందరు పడుకుని నిద్రపోతూండటం చూసి సుందరుడు తాను కూడా వారి మధ్య కదలకుండా పడుకున్నాడు. ఊరి వెలపల ఉన్న క్రీడోద్యానం నుంచి ఏ రహస్యమార్గాల వార్త వెళ్ళిందో తెలియదు, వీధి వెంబడి మనుషులు, "యువరాజు ఇక్కడెక్కడో తిరుగుతున్నాడుట. వాడి తల దొరికితే రాజుగారు మనిషెత్తు బంగారం ఇస్తారు. భలే మంచి అవ






కాశం!" అనుకుంటూ వెళ్ళటం విని సుందరుడు నిర్ఘాంతపోయాడు.

త్వరలోనే వీధిలో సందడి అణగి పోయింది. సుందరుడు ఎందుకైనా మంచి దని అలాగే పడుకుని తన పరిస్థితి గురించి ఆలోచించుకోసాగాడు. ఒక మహారాజు కడుపున పుట్టి రాజ్యాన్ని ఏలుతూ ఉండ వలిసిన తాను ప్రాణాలు అరచేత పట్టుకుని సత్రం అరుగుమీద నక్కవలిసి వచ్చింది. తన రాజ్యాన్ని అపహరించినవాడు పరమ దుర్మార్గుడు, నీచుడు, హంతకుడు! తన చేత తాళి కట్టించుకున్నది, తాచుపాము లాటిది, మీదుమిక్కిలి అది తన శత్రువు చేతిలో కీలుబొమ్మ! తన తల దొరికితే మహామంత్రికి అర్పించి ఈనాం పొందాలని నగరంలో ఉండే క్షుద్రులందరూ అర్ధరాత్రి వేళ వీధులవెంట కారాడుతున్నారు! జీవితం ఎంత చిత్రమైనది!

ఇలా ఆలోచించుకుంటున్న సుందరుడికి అడుగుల చప్పుడు వినిపించింది. ఎవరో మనిషి సత్రం మెట్లెక్కి అరుగుమీదికి వచ్చి తనకు దగ్గిరలో నిలబడ్డట్టు అతనికి తోచింది. ఇదే తన ఆఖరు క్షణ మనుకున్నాడు సుందరుడు.

కాని ఆ వచ్చినమనిషి అతని తల కోసం చూసే హంతకుడు కాడు. అతను ఒక గొప్ప గజదొంగ, మంత్రసిద్ధి కలవాడు కూడానూ. అతను ఏడాది కొకసారి దొంగతనానికి బయలుదేరేవాడు; గొప్పవాళ్ళ ఇళ్ళు మాత్రమే ప్రవేశించేవాడు, రత్నాలు మాత్రమే దొంగిలించేవాడు. వెండి బంగా రాలు అతనికి మట్టితో సమానం. అతను దొంగలలో రాజులాంటి వాడు. అందుచేత తాను దొంగతనానికి వెళ్ళేటప్పుడు తాను తస్కరించిన సొత్తు మొయ్యటానికి తన వెంట ఒక కూలివాణ్ణి పట్టుకుని మరీ బయలుదేరేవాడు. ఆ దొంగ ఇప్పుడు కూలి వాడి కోసమే సత్రంలోకి అడుగుపెట్టాడు.

కటిక చీకటిగా ఉన్నప్పటికీ అతను కళ్ళకు అంజనం వేసుకుని ఉండటంచేత సత్రం అరుగుమీద పడుకుని ఉన్నవారంతా స్పష్టంగా కనిపించారు. ఆ అందరిలోకీ సుందరుడే దృఢంగా కనిపించాడు. అందుచేత దొంగ సుందరుణ్ణి తన చేతి కర్రతో తట్టి, అతను తల ఎత్తి చూడగానే, తన వెంట రమ్మని సైగచేశాడు.

సుందరుడు లేచి వచ్చాడు.

"ఎవరు నీవు?" అని దొంగ అడిగాడు.

"నేనొక బిచ్చగాణ్ణి," అని సుందరుడు సమాధానమిచ్చాడు.

"నా వెంట వచ్చి, నేను చెప్పినట్టు చేస్తావా? డబ్బిస్తాను," అన్నాడు దొంగ.

"కన్ను పొడుచుకున్నా కనిపించటం లేదు, నేనేం పని చెయ్యగలను?" అన్నాడు సుందరుడు.

దొంగ అతని కళ్ళకు కొంచెం అంజనం తీసి రాచాడు. అతని కళ్ళు ప్రతి వస్తువునూ చూడగలిగాయి. అతను దొంగ వెంట బయలుదేరాడు. దొంగ సరాసరి సుందరుడి భవనానికే దారితీశాడు. సుందరుడు ఏం జరుగుతుంతో నని ఆత్రంగా చూడసాగాడు. దుర్భేద్యమైన ఆ భవనంలోకి దొంగ అతి సులువుగా ప్రవేశించి కొంతసేపటికి అనేక



రత్నాభరణాలతో తిరిగి వచ్చాడు. ఆభరణాలన్నీ ఒక సంచీలో ఉన్నాయి. ఆ సంచీని అతను సుందరుడికిచ్చి తన వెంట రమ్మన్నాడు.

ఇద్దరూ చాలాసేపు నడిచి నగరం వెలపల ఉండే కొండ ప్రాంతాన్ని చేరుకుని అక్కడి గుహ వద్దకు వచ్చారు. దొంగ ఏదో మంత్రం చదివేసరికి గుహకు అడ్డంగా ఉండే రాయి తెరుచుకున్నది ఇద్దరూ లోపలికి వెళ్ళినాక అది ఎప్పటిలా మళ్ళీ మూసుకున్నది.

గుహ లోపల చక్కని భవనం ఉన్నది. అందులో దొంగా, అతని భార్యా, అతని

కుమార్తె నివసిస్తున్నారు. సుందరుణ్ణి బయటి వసారాలో ఉంచి, సొమ్ముతోసహా దొంగ లోపలికి వెళ్ళాడు.

"ఇవాళ నాకు దొరికిన కూలివాడు కుర్రవాడు, చాలా అందంగా ఉన్నాడు. వాణ్ణి చూడగానే మన అమ్మాయికి మంచి జోడు అవుతాడనిపించింది," అని దొంగ తన భార్యతో అన్నాడు.

"ఎంత అందంగా వుంటే మాత్రం కూలివాడికి అమ్మాయినెలా ఇస్తాం? అందర్నీ చంపినట్టే వాణ్ణికూడా చంపెయ్యండి. అమ్మాయికి సంబంధమే దొరక్కపోతుందా ఏమిటి?" అన్నది భార్య.

తన తల్లి దండ్రులనుకునే ఈ మాటలు విని దొంగ కూతురు వసారాలోకి చల్లగా వచ్చి సుందరుణ్ణి చూసింది. వెంటనే ఆమెకు అతనిపై ప్రేమా, జాలీ పుట్టాయి. ఆమె చప్పున అతని చెయ్యి పట్టుకుని గుహ ద్వారం వద్దకు లాక్కుపోతూ, "వెంటనే వెళ్ళిపో! లేకపోతే నీ ప్రాణాలు దక్కవు!" అన్నది. ఆమె అతనికి మంత్రం చెప్పింది. ఆ మంత్రం చదవగానే గుహ తెరుచుకున్నది. సుందరుడు బయటికి వచ్చి నగరం కేసి పరిగెత్తాడు.

తన ప్రాణాలు కాపాడిన దొంగ కుమార్తె చాలా అందగత్తె. ఆమె అందాన్నీ,



ఆమె తనపై చూపిన అభిమానాన్నీ అతను మరవలేకపోయాడు.

చాలా దూరం పరిగెత్తి అలిసిపోయి ఉండటంవల్ల సుందరుడు ఎక్కడైనా చతికిలబడి కాస్త విశ్రాంతి పుచ్చుకుందా మనుకున్నాడు. అతను ఒక ఇంటి ముందున్న అరుగుమీద కూచున్నాడు. ఆ ఇంటిలో నుంచి అతనికి సందడి విన వచ్చింది. తెల్లవారటానికింకా కొంత వ్యవధి ఉన్నది. "ఈ వేళప్పుడు ఈ ఇంట్లో ఏమి తంతు జరుగుతూ ఉండిఉంటుంది?" అని సుందరుడు ఆశ్చర్యపడ్డాడు.



అతను ఇలా ఆలోచిస్తూ ఉండగానే కొందరు బ్రాహ్మణులు సమిధలూ, ఒక కుండలో నెయ్యీ, ఇతర పరికరాలూ పట్టు కుని ఆ ఇంటికి వచ్చారు. సుందరుడు వారిని పలకరించి, "అయ్యలారా, ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"ఈ ఇల్లు సోమయాజిగారిది. మన రాజకుమారుడికి ఈ తెల్లవారు ఝామున సర్పగండం ఉన్నదని సిద్ధాంతులందరూ గుణించి చెప్పారు. సోమయాజిగారు సర్ప యాగం చేసి రాజకుమారుడికి ఆపద తప్పిస్తున్నారు. ఆయనవల్ల యజ్ఞం ఏమవు తుంది? అందుకని మేం పదిమంది ఇళ్ళూ తిరిగి అవసరమైన వస్తువులన్నీ పట్టు కొస్తున్నాం. రాజకుమారుడి కోసమంటే ఈ నగర ప్రజలు ప్రాణాలివ్వమన్నా ఇస్తారు, బాబూ. వాళ్ళంతా అతగాడిపైనే ఆశలన్నీ పెట్టుకున్నారాయె!" అని ఆ బ్రాహ్మలు సుందరుడితో అన్నారు.

"నేనుకూడా లోపలికి వచ్చి ఆ సర్ప యాగం చూడవచ్చునాండీ?" అని సుంద రుడు కృతజ్ఞతతో అడిగాడు.

"రా, నాయనా! తప్పకుండా చూడ వచ్చు. మహామంత్రికి ఏమాత్రం తెలిసినా యజ్ఞానికి భంగం కలిగిస్తాడని రహస్యంగా చేస్తున్నాం గాని, న్యాయంపడితే నగర




మంతటినీ ఆహ్వానించ వలసిన విషయం కదా!" అన్నారు బ్రాహ్మలు.

ఒక్కొక్క సంగతే వింటున్నకొద్దీ సుందరుడికి తన బాధ్యత మరింతబాగా తెలిసివస్తున్నది. క్షణక్షణానికి తన భారం పెరుగుతున్నది. తాను ఇంతకాలమూ ఈ బాధ్యతను ఉపేక్షించి నందుకు నొచ్చుకుంటూ, అతను బ్రాహ్మల వెంట లోపలికి వెళ్ళి ఒక మూలగా కూచున్నాడు.

లోపల హోమగుండం తయారుచేశారు. అందులో అగ్ని ఉంచి మంత్రోక్తంగా నెయ్యిపోస్తూ పెద్ద జ్వాల తయారుచేశారు. అగ్నిగుండం చుట్టూ కూర్చున్న బ్రాహ్మలు గొంతులెత్తి పెద్దగా మంత్రాలు చదువుతున్నారు. అకస్మాత్తుగా ఇంటి కప్పులోనుంచి సుందరుడి నెత్తిన ఏదో పడి మరుక్షణం ఎవరో విసిరినట్టుగా అగ్నిగుండంలో పడింది. అది ఒక పెద్ద తాచుపాము.

బ్రాహ్మలు మంత్రాలు చదవటం ఆపి సుందరుడి కేసి ఆశ్చర్యంగా చూశారు. ఒక సిద్ధాంతి బయటికి వెళ్ళి ఆకాశంకేసి చూసి, "విషఘడియ దాటిపోయింది!" అని కేకపెట్టాడు.

బ్రాహ్మలు సుందరుణ్ణి సమీపించి, "నాయనా, దాచక చెప్పు. నీవేనా మా యువరాజువు?" అని అడిగారు.

సుందరుడు వారి పాదాలకు నమస్కారం చేసి, "నేను యువరాజునై మీకు చిన్న మెత్తు ఉపకారం చేయకపోయినా మీరు నామీద వాత్సల్యంతో నాకు రాబోయే ఆపద ముందే గ్రహించి నా ప్రాణాలు కాపాడారు. మీరు నాకు తండ్రులు. నేను మీ కుమారుణ్ణి! మీరేది ఆజ్ఞాపిస్తే అది చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.

"శీఘ్రమేవ రాజ్య ప్రాప్తిరస్తు!" అని బ్రాహ్మలు సుందరుణ్ణి దీవించారు.

సుందరుడు వారి ఆశీర్వాదాలు పొంది ఇంటికి బయలుదేరేసరికి తూర్పు తెల్లవారు

తున్నది. అప్పటికే తాత లేచి, సుందరుడు ఎక్కడా కనబడకబోయేసరికి, ఏదో జరిగిందని గాభరాపడి పోతున్నాడు. దీనికి తగ్గట్టుగా దొంగలు ఇల్లు కొల్లగొట్టినట్టు తెలుస్తున్నది. మహామంత్రే ఏదో దుండగం చేశాడనీ, తాను ఇంతకాలమూ రాజకుమారుణ్ణి కాపాడటానికి చేసిన ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరయిపోయిందనీ, యువరాజు ఇక మళ్ళీ తనకు ప్రాణాలతో కనిపించడనీ ఆ ముసలివాడు తహతహలాడిపోతున్నాడు.



ఆ సమయంలో సుందరుడు ఇంటికి తిరిగి వచ్చాడు. తాతకు ప్రాణాలు లేచి వచ్చినట్టయింది.

"బాబూ, నాతో చెప్పకుండా రాత్రివేళ ఎక్కడికి వెళ్ళావు?" అని తాత అడిగాడు.

"ఆ సంగతులన్నీ తరవాత చెబుతాను. ముందు నీవు పోయి ముఖ్యమంత్రిని పిలుచుకురా!" అన్నాడు సుందరుడు.

యువరాజు పిలుస్తున్నాడనగానే ముఖ్యమంత్రి వచ్చాడు. "ఎందుకు నన్ను రమ్మన్నారట?" అని ఆయన సుందరుణ్ణి అడిగాడు.

"నిన్నరాత్రి మహామంత్రికి మీరు మాట ఇచ్చారుగదా; వారంరోజుల లోపుగా నా తల తెచ్చి ఇస్తానని! అందుకే పిలిచాను!" అన్నాడు సుందరుడు.

ముఖ్యమంత్రి సుందరుడి కాళ్లపై పడి, "క్షమించండి, మహారాజా! ఆ దుర్మార్గుడితో నేను వేగలేక, ఎలాగైనా పారిపోయే ప్రయత్నంలో ఉన్నాను. నేను నిజంగా తమకు అపకారం చెయ్యగల ననుకుంటున్నారా?" అన్నాడు కళ్లనీళ్లు పెడుతూ.

"ఎక్కడికీ పారిపోనవసరం లేదు. రాజద్రోహ నేరం కింద ఆ మహామంత్రినీ, వాడి ఉంపుడు గత్తెనూ పట్టుకురావటానికి భటులను పంపండి. ఇకనుంచీ నేను రాజును, మీరే మహామంత్రి. ఇవాళ సభకు వచ్చి

అ రాజద్రోహుల నిద్దరినీ విచారించి శిక్షిస్తాను," అన్నాడు సుందరుడు.

ఆ ఉదయం రాజ్యసభ ఆరంభమయే సరికి మహామంత్రికీ, యువరాజు భార్యగా నటిస్తున్న దుర్మార్గురాలికీ సంకెళ్ళు తగిలించి భటులు తెచ్చారు. సుందరుడు తన ఇరవైమంది మిత్రులతోనూ వచ్చాడు. అతను మొదటిసారిగా తన సింహాసనంపై కూర్చున్నాడు.

రాజద్రోహుల విచారణ జరిగింది. వారికి శిరశ్ఛేదం విధించబడింది.

ఈవార్త కార్చిచ్చులాగా నగరమంతా వ్యాపించింది. జనంలో కలిగిన ఆనందోత్సాహానికి అంతులేదు. ప్రతి ఇంటా పండగ చేసుకున్నారు.

ఆ రోజే కొంత సైన్యాన్ని వెంటబెట్టుకుని సుందరుడు గజదొంగ ఉండే గుహకు వెళ్లి, మంత్రం తెలిసి ఉండటంచేత సులువుగా లోపల ప్రవేశించాడు. తనకు మరణదండన పడుతుందని దొంగ అనుకున్నాడు. కాని సుందరుడు అతన్ని ఏమీ చెయ్యలేదు.

"నీవు దొంగతనం చేసిన సొమ్ము తీసుకుపోయి ప్రజలకు పంచటానికీ, నీ కుమార్తెను నా కిచ్చి పెళ్ళి చెయ్యమని అడగటానికీ వచ్చాను. గడిచిన రాత్రి నీకు కూలీగా పని చేసినది నేనే. మీ అమ్మాయి నాపట్ల చూపిన ఆదరాన్ని నేను మరవలేను," అన్నాడు సుందరుడు.

తరవాత సుందరుడు పరిపాలనా వ్యవస్థ యావత్తూ సరిదిద్దాడు. దానధర్మాలు మళ్లీ మునుపటిలాగే సాగాయి. ధర్మ సత్రాలకు మళ్ళీ జీవం వచ్చింది. సర్పయాగం చేసిన బ్రాహ్మలే వచ్చి సుందరుడికి రాజ్యాభిషేకమూ, వివాహమూ జరిపించి, అంతులేని బంగారం దక్షిణగా పుచ్చుకున్నారు.

సుందరుడు ప్రజల కష్టసుఖాలు తనవిగా చూసుకుంటూ, తన భార్యతో సుఖంగా జీవించాడు.






# అక్షయ పాత్ర

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కొందరు నీలాగా అల్పప్రయోజనం కోరి అధిక శ్రమపాలవుతారు. మరికొందరు శుభదత్తుడిలాగా అనుకోకుండా అదృష్ట దేవతకు ఆదరపాత్రులవుతారు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు వాడి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు :

శుభదత్తుడనే వాడు చాలా పేదవాడు. వాడు రోజూ అడవికిపోయి ఒక మోపు కట్టెలు తెచ్చి, వాటిని అమ్ముకుని తన సంసారం గడుపుకుంటూ ఉండేవాడు.

ఒకనాడు వాడు అడవిలో చాలాదూరం పోయాడు. అక్కడ వాడికి తలపని తలంపుగా నలుగురు పురుషులు కనిపించారు. వారు మామూలు మనుషులు కారు,



నుంచి తీసి మాకు భోజనాలు పెట్టు,"
అన్నారు. శుభదత్తుడు కుండలోకి చూస్తే అది ఖాళీగా ఉంది. ఏంచెయ్యాలో తోచక వాడు తికమక పడసాగాడు.

"అది మామూలు కుండ కాదురా; అక్షయపాత్ర. అందులో చెయ్యి పెట్టి ఏది కోరుకుంటే అదెల్లా చేతికి దొరుకుతుంది. చెయ్యిపెట్టి చూడు," అన్నారు యక్షులు.

శుభదత్తుడు కుండలో చెయ్యి పెట్టి, వారన్నట్టుగానే, కోరినదెల్లా పైకి తీశాడు. ముందు యక్షులు భోజనం చేశారు. తరవాత శుభదత్తుడు కూడా భోజనం చేశాడు. అది మొదలు వాడు ఆ యక్షులను ఎంతో భయ భక్తులతో కొలుస్తూ వచ్చాడు. యక్షులు వాడి కుటుంబానికి ఏలోటూ లేకుండా చూస్తూ వాడి కోసం బెంగపడిన వాడి కుటుంబాన్ని కలలో ఓదార్చుతూ వచ్చారు.

యక్షులు. వారు ధరించిన బట్టలూ, దివ్యమైన ఆభరణాలూ చూసి కట్టెలుమోసే శుభదత్తుడు బెదిరిపోయాడు.

ఆ యక్షులు వాడి భయంచూసి జాలి పడి, "ఓరీ, నీవు మాకు సేవచేస్తూ ఇక్కడే ఉండిపోతావా ఏమిటి? నీకూ, నగరంలో ఉండే నీ కుటుంబానికీ లోటు జరగకుండా మేము చూస్తాము," అని వాడితో అన్నారు. శుభదత్తుడు వారే పని చెబితే ఆపని చేస్తూ అక్కడే ఉండిపోవటానికి సమ్మతించాడు.

వాడి సహాయంతో వాళ్ళు స్నానాలు చేశారు. భోజనంవేళ అయింది. వారు వాడి కొక కుండ చూపించి, "ఓరీ, ఈ కుండలో

ఈవిధంగా ఒక నెల గడిచినాక యక్షులు శుభదత్తుడితో, "ఓరీ, నెల రోజులపాటు మమ్మల్ని ఎంతో శ్రద్ధగా సేవించావు. నీ పైన మాకు అనుగ్రహం కలిగింది. ఏమి కావాలో కోరుకో," అన్నారు.

"మీకు నిజంగా నాపైన దయ ఉంటే ఈ అక్షయపాత్ర నాకిప్పించండి," అన్నాడు శుభదత్తుడు.

యక్షులు నవ్వి, "పిచ్చివాడా, పగిలి పోయే ఈ కుండ ఎందుకు కోరతావు? ఇంత కన్న శాశ్వతమైన మేలు కలిగేటట్టుగా మరే దైనా కోరుకో," అన్నారు.

"కాదు, నాకీ కుండే ఇప్పించండి," అన్నాడు శుభదత్తుడు. వాడి మనస్సంతా దానిపైనే ఉండటం గ్రహించి యక్షులు వాడికా అక్షయపాత్ర ఇచ్చి, వాణ్ణి ఇంటికి పంపారు. నెల రోజులైన తరవాత ఇంటికి వచ్చిన శుభదత్తుణ్ణి చూసి వాడి బంధువులు చాలా సంతోషించారు. శుభదత్తుడు తాను తెచ్చుకున్న అక్షయపాత్రను రహస్యంగా ఇతర కుండల మధ్య ఉంచాడు. తరవాత వాడు ఆ కుండలో నుంచి రకరకాల భక్ష్య, భోజ్య, పానీయాలు తీసి తనను చూడ వచ్చిన వారందరికీ పెట్టి, తాగుడుకూడా ఇచ్చాడు. అందరూ మరింత సంతోషించారు. అదిమొదలు వాడు రోజూ తన బంధువుల నందరినీ పిలిచి విందులు చెయ్య సాగాడు. వీడికి ఉన్నట్టుండి ఇంత సిరి ఎత్తుకోవటానికి కారణమేమిటా అని బంధువులు ఆశ్చర్యపోయారు, కాని వారికి అసలు రహస్యం తెలియలేదు.

ఒకనాడు వాడు బాగా తాగి కైపెక్కి ఉండగా వాడి బంధువులు, "ఒరే, కట్టెలు



మోసి బతికేవాడివి గదా, నీవు ఈ విందులు ఎట్లా చేస్తున్నావురా? ఏమిటి దీని రహస్యం?" అని అడిగారు.

అసలే కైపులో ఉన్న శుభదత్తుడు ఈ మాటలకు ఆనందపరవశుడయాడు. వాడు తన బంధువులకు అక్షయపాత్ర గురించి నోటితో చెప్పటానికి మారుగా, తూలుతూ లోపలికి వెళ్ళి, యక్షులిచ్చిన కుండ భుజాన ఎత్తుకుని నృత్యం చేస్తూ ఇవతలికి వచ్చాడు. వాడి కాళ్ళు తడబడి వాడు కాస్తా బోర్లా పడ్డాడు. కుండ పగిలి ముక్కలు ముక్కలయింది. మహిమగల కుండ కావటం చేత ఆ పెంకులుకూడా చూస్తూండగానే

ఎక్కడివక్కడ అంతర్ధానమై ఏమీ మిగల లేదు. శుభదత్తుడికి సిరి ఎట్లా ఎత్తుకున్నదో అట్లాగే పోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, శుభ దత్తుడు పరమ మూఢుడన్న సంగతి తెలుస్తూనే ఉంది. కాని వాడి మూఢత్వం ఎందులో ఉన్నది? యుక్తులు వద్దంటున్నా వినక అక్షయపాత్రను కోరుకోవటంలోనా, ఆ అక్షయపాత్ర రహస్యం బంధువుల ఎదట దాచకుండా ఉంచక పోవటంలోనా, లేక తప్ప తాగిన స్థితిలో దాన్ని భుజాన ఎత్తుకుని నృత్యం చెయ్యటంలోనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శుభదత్తుడి మూఢత్వం వాడి పేద జీవితంలోనే ఉన్నది. కడుపునిండా తినటమూ, కోరిన వన్నీ తిన గలగటమూ వాడు ఏనాడూ ఎరగడు. వాడి జీవితంలో అంతకుమించిన ఆనందంకూడా ఏమీ లేదు. ఆ ఆనందం వాడికి అక్షయ పాత్రలోనే ప్రత్యక్షంగా కనిపించింది. అందుచేతనే యుక్తులు చెప్పినా వినక వాడు అక్షయపాత్ర కోరుకున్నాడు. వాడి స్థితిలో ఉన్నవాడు ఆ పని చెయ్యటం అస్వాభావికం కాదు. వాడు తన అక్షయపాత్రను రహ స్యంగా ఉంచటానికే ప్రయత్నించాడు కాని బంధువులు సానుభూతితో అడిగినప్పుడు తన ఆనందాన్ని వాళ్ళతో పంచుకోకుండా ఉండలేక కుండను వారి ఎదటికి తెచ్చాడు. అందులోకూడా మూఢత్వం ఏమీలేదు. ఆ పాత్రను భుజానికెత్తుకున్నప్పుడు ఆనందం కలిగి నృత్యం చెయ్యాలని పించటంలోకూడా మూఢత్వం ఏమీలేదు. అక్షయపాత్ర లభించకమునుపే పేదరికం వాణ్ణి మూఢుణ్ణి చేసింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# తారుమారు

పాటలీపుత్రం అనే మహానగరంలో శాండిల్యుడనే బ్రాహ్మణుడుండేవాడు. ఇతనిది గర్భదరిద్రపు కుటుంబం. ఇతనికి చదువు సంధ్యలుకూడా రావు. అందుచేత శాండిల్యుడు బ్రాహ్మణీకం చేసికూడా పొట్ట పోసుకోలేక, అన్నానికి మొహంవాచి బౌద్ధ మతంలో చేరి బౌద్ధసన్యాసి అయాడు. అయితే బౌద్ధసన్యాసులు రోజుకు ఒకపూటే భోంచేస్తారు. అందువల్ల బౌద్ధసన్యాసి అయినాకూడా అతడికి తృప్తిగా భోజనం లేకపోయింది. అతను బౌద్ధసన్యాసి వేషం తీసి పారేసి ఎలాగో ఒక స్వాములవారిని ఆశ్రయించాడు. సన్యాసులకు భిక్షలు దండిగా జరుగుతాయి, వారి శిష్యులకు తిండి లోటు ఉండదని శాండిల్యుడు ఈ పని చేశాడు.

శాండిల్యుడు ఆశ్రయించిన స్వాముల వారు గొప్ప జ్ఞానీ, గొప్ప యోగీకూడానూ.

ఒకనాటి ఉదయం గురుశిష్యులిద్దరూ నగరంలో నడుస్తూ ఒక పెద్ద ఉద్యానవనం దగ్గిరికి వచ్చారు. దారి పొడుగునా శాండిల్యుడు భిక్షలను గురించీ, భక్ష్యాలను గురించీ, వసపోసిన పిట్టలాగా వాగుతుంటే స్వాములవారు ఓర్పుతో సహిస్తున్నాడు.

శాండిల్యుడు మూఢుడుకూడానూ. ఉద్యానవనం చూస్తూనే వెనక్కు తగ్గి, స్వాములవారు, "నడవరా!" అంటే, "అమ్మో, నాకు భయం! అశోకచెట్టు చిగుళ్ల వెనక పెద్దపులి దాక్కుని ఉంటుందిట! ముందు మీరు పదండి!" అన్నాడు.

"చదువుకోరా నాయనా, నీకీ అపోహ లన్నీ పోతాయి," అన్నాడు స్వాములవారు.

"ముందు భోజనం సంగతి చూడా లండీ!" అన్నాడు శిష్యుడు.

ఆ నగరంలోనే వసంతసేన అనే వేశ్య ఉంటున్నది. ఆమెకు రామిలకుడు అనే

పల్లవ మహేంద్రవర్మ నాటక కథ



సేన గొంతెత్తి హాయిగా పాడసాగింది. ఆ పాట వినగానే శాండిల్యుడికి ఎక్కడ లేని ఉత్సాహమూ వచ్చింది. అతను తన గురువునుకూడా పాట ఆలకించి ఆనందించ మన్నాడు. స్వాములవారు ఆ పాటలో ఏమాత్రమూ ఆసక్తి చూపకపోయే సరికి చీదరించుకుని శాండిల్యుడు వసంతసేన ఉండే చోటు సమీపించి, ఆమెను చూస్తూ, పాట వింటూ నోరు తెరుచుకు అక్కడే నిలబడిపోయాడు.

వసంతసేన పాట ముగించి, తన వెంట ఉండే పరభృతికతో మాట్లాడటం మొదలు పెట్టింది. ఆ మాటలనుబట్టి ఆమె వేశ్య అనీ, తనకే డబ్బుంటే ఆమె స్నేహం తనకు కూడా లభించేదేననీ అనుకున్నాడు శాండిల్యుడు.

ఇంతలో అక్కడికి యమకింకరు డొకడు వచ్చాడు. వసంతసేనకు ఆయుర్దాయం తీరి పోయిందని చెప్పి ఆమె ప్రాణాలు పట్టుకు రమ్మని వాణ్ణి పంపారు. వాడు వచ్చి ఒక పక్కగా నిలబడి ఆమె ప్రాణాలు తీసుకు పోయే అవకాశం కోసం వేచిఉన్నాడు.

వసంతసేన అశోకచెట్టు చిగుళ్ళు కొయ్యా టానికి లేచింది. "నేను కోస్తాను, నువు ఉండు," అని పరభృతిక అంటున్నా ఆమె

ప్రియుడున్నాడు. అతను ఆమెను ఈ పూట ఈ ఉద్యానవనానికి రమ్మని కబురుచేశాడు. అందుచేత వసంతసేన ఇద్దరు చెలికత్తెలను వెంటబెట్టుకుని ఈ సమయానికి ఉద్యాన వనానికి వచ్చింది. కాని రామిలకుడే రాలేదు. అతను జూదరులైన స్నేహితులను కలుసు కోవటానికి వెళ్ళి ఆలస్యం చేశాడు.

రామిలకుణ్ణి పిలుచుకురావటానికని వసంతసేన తన చెలికత్తెలలో మధుకరిక అనేదాన్ని పంపింది. పరభృతిక అనే చెలి కత్తె మాత్రం ఆమె వెంట ఉన్నది.

మంచి వసంతకాలం. ఉద్యానవనం శోభగా ఉన్నది. ఆ ఉత్సాహంలో వసంత

ఆగలేదు. వసంతసేన అందని చిగుళ్ళను ఎగిరెగిరి అందుకుని కోస్తూఉన్న సమయంలో యమకింకరుడు పాము రూపం ధరించి ఆమెను కాటువేశాడు.

తనను కరిచినది పాము అని తెలియగానే వసంతసేన కెవ్వున అరిచింది. ఆమెకు వికారాలు ప్రారంభమయాయి. పరభృతిక లబలబ లాడసాగింది. ఈ గోల విని శాండిల్యుడు సమీపానికి వచ్చి, జరిగినది చూసి, అవతలికి వెళ్ళి గురువుగారితో చెప్పాడు.

"కర్మక్షయం అయింది కాబోలు," అని స్వాములవారు నిశ్చింతగా అన్నాడు. శాండిల్యుడు గురువుగారి మీద రోత పడి వసంతసేన పడిఉన్న చోటికి వచ్చాడు.

వసంతసేనకు అవసాన ఘడియ సమీపించింది. ఆమె తన తల్లికి నమస్కారాలూ, శామిలకుడికి తన ప్రేమా చెప్పుకుని ప్రాణాలు వదిలింది. ఆమె చనిపోయినందుకు శాండిల్యుడు బిగ్గిరిగా ఏడవసాగాడు.

అతను చూడబోతే సాధువులాగా ఉన్నాడు, ముక్కూ మొహమూ ఎరగని మనిషి కోసం ఏడుస్తున్నాడు. పరభృతిక అతన్ని చూసి, "ఎవరో, పాపం, దయార్ద్ర హృదయుడు లాగున్నాడు," అనుకుని, వసంతసేన వద్ద ఉండమని అతన్ని వేడుకుని, జరిగిన సంగతి వసంతసేన తల్లికి చెప్పటానికి వెళ్ళిపోయింది.



శాండిల్యుడు వసంతసేనకు ఏవేవో పరిచర్యలు చేయసాగాడు. ఆమె ప్రాణాలతో ఉండగా తాకలేక పోతినే అని ఎంతగానో దిగులుపడ్డాడు.

అవతలి నుంచి స్వాములవారు పిలుస్తున్నాడు, వచ్చి అధ్యయనం చెయ్యమంటున్నాడు. కాని ఆయన మాటలు శాండిల్యుడి తలకు ఎక్కటం లేదు.

వసంతసేన కారణంగా తన శిష్యుడి బుద్ధి పూర్తిగా చెడిపోయిందని స్వాములవారు గ్రహించాడు. అతడికి ఆమె తప్ప

ఇప్పుడు మరొక ప్రపంచం లేదు. తన శిష్యుడి బుద్ధి మార్చాలంటే వసంతసేన ద్వారానే మార్చాలి.

స్వాములవారు మహా యోగి. ఆయన తన శరీరాన్ని వదిలి, చనిపోయిన వసంతసేన శరీరంలో ప్రవేశించాడు. చచ్చిపోయిన వసంతసేన కదలటమూ, కళ్లు తెరవటమూ, లేచి కూచోవటమూ చూసి శాండిల్యుడు పరమానంద భరితుడయాడు. అతడికి తన ప్రాణాలేపోయి తిరిగి వచ్చినంత సంతోషం కలిగింది.

"శాండిల్యా! శాండిల్యా!" అని వసంతసేన పిలిచింది.

"ఇదుగో, ఇక్కడే ఉన్నా!" అంటూ శాండిల్యుడు ఆమెకు మరింత దగ్గిరిగా జరిగాడు.

"కాళ్ళూ చేతులూ కడుక్కురా. అంత దాకా నన్ను అంటటానికి వీల్లేదు," అన్నది వసంతసేన.

"అబ్బో, ఈమె ఎంత పవిత్రురాలో!" అనుకున్నాడు శాండిల్యుడు, ఆ మాట్లాడేది స్వాములవారేనని తెలియక.

"శాండిల్యా, అధ్యయనం చెయ్యి," అని వసంతసేన అతణ్ణి ఆజ్ఞాపించింది.

"ఈమెకు కూడా గురువుగారి పిచ్చే పట్టిందా?" అనుకున్నాడు శాండిల్యుడు.





కూడా తిన్నదనీ తెలుసుకుని, తన సరంజామా అంతా పరిచి పాముమంత్రాలు చదవసాగాడు.

"ఓరి పిచ్చి వైద్యుడా, చాలు చాలు!" అన్నది వసంతసేన.

వైద్యుడు ఆశ్చర్యపడి తనకన్న గట్టి వైద్యుణ్ణి తీసుకురావటానికి వెళ్ళాడు.

ఈలోపుగా, వసంతసేన ప్రాణాలను పట్టుకుపోయిన యమకింకరుడు యమధర్మరాజుచేత నానా తిట్లూ తిన్నాడు. వాడు తేవలిసింది ఈ వసంతసేన ప్రాణాలు కావుట, ఇంకో వసంతసేనవిట. "ఈమె ప్రాణాలు ఈమె శరీరంలో ప్రవేశపెట్టి రెండో వసంతసేనవి వెంటనే పట్టుకురా!" అని యముడు కింకరుణ్ణి ఆజ్ఞాపించాడు.

ఆలస్యమైపోతే వసంతసేనకు దహన క్రియలుకూడా అయిపోతాయేమోనని హడలిపోతూ యమకింకరుడు వసంతసేన ప్రాణాలతో వచ్చి చేరాడు. కాని వసంతసేన కళేబరంలో అదివరకే ప్రాణాలు చేరి ఉండటం చూసి వాడు నిర్ఘాంత పోయాడు.

వసంతసేన శరీరంలో ఉన్న జీవుడు మహాజ్ఞాని అని యమకింకరుడు తెలుసుకున్నాడు. ఇప్పుడేమిటి కర్తవ్యం. తన వద్ద ఉన్న వేశ్య ప్రాణాలు ఏదో ఒక బొందెలో

"చెంగు విడిచిపెట్టు, నల్లమొహమూ నువ్వూనూ!" అని వసంతసేన గదమాయించే సరికి రామిలకుడు నివ్వెరపోయి, "ఏమిటిది?" అని పరభృతికను అడిగాడు.

వసంతసేన పాము కరిచి పడిపోయిందనీ, మళ్ళీ లేచినప్పటి నుంచీ ఈ తీరున పిచ్చి మాటలు మాట్లాడుతున్నదనీ పరభృతిక అతనికి చెప్పింది.

ఇంతలో వైద్యుడు "ఏదీ ఆ మనిషి?" అంటూ, వచ్చాడు. పరభృతిక వసంతసేనను చూపింది. నిజానికి వైద్యుడు గట్టివాడే; వసంతసేనను చూస్తూనే ఆమె పామును చూసి భయపడిందనీ, కాటు

చేర్చి తాను రెండో వసంతసేన ప్రాణాలు తీసుకుని యమధర్మరాజు వద్దకు సత్వరం వెళ్ళితీరాలి.

ఏమి చెయ్యటానికీ పాలుబోక యమ కింకరుడు వసంతసేన ప్రాణాలను స్వాముల వారి శరీరంలో చేర్చి తన పని చూసుకో బోయాడు. స్వాములవారు లేచి కూచుని, "పర భృతికా! ఓ, పరభృతికా!" అని పిలవ సాగాడు. నిజానికి ఆ పిలుపు వసంతసేనదే.

"అమ్మయ్య, స్వాములవారు బతికాడు!" అనుకున్నాడు శాండిల్యుడు.

"రామిలకుడేడీ?" అని స్వాములవారి శరీరంలో ఉన్న వేశ్య అడిగింది. "ఏమి, స్వామీ?" అంటూ రామిలకుడు ఆయన దగ్గిరికి వచ్చాడు.

"నన్ను పట్టుకో, రామిలకా! దగ్గిరికిరా!" అని స్వాములవారు ప్రేమగా పిలవటం అతన్ని ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. అసలు స్వాములవారి ప్రవర్తన యావత్తూ వసంత సేనను జ్ఞాపకం చేస్తున్నది. ఆయన రామిలకుణ్ణి, "ఇవాళ ఇంత ఆలస్యం చేశావేం?" అని అడిగాడు. దూరంగా నిలబడివున్న వసంతసేన తల్లిని చూసి, "అమ్మా, నేనిక్కడున్నానే! రావే!" అన్నాడు.

అవతల వసంతసేన అచ్చు స్వాముల వారల్లే ప్రవర్తిస్తున్నది. ఎనిమిది మందు



కుప్పెలు తెచ్చిన కొత్త వైద్యుణ్ణి ఆమె అదర గొట్టింది. "కరిచిన పాము ఏ జాతిదో చెప్పు! నీకు శాస్త్రం తెలుసా?" అని అతణ్ణి దబా యించింది. అతను తనకు తెలిసినదేదో చెబితే అందులో తప్పులు పట్టింది. విష వేగాలు ఎన్ని ఉన్నాయో చెప్పమన్నది.

"ఇది మనవల్ల కుదిరే వ్యాధికాదు," అన్నాడు కొత్తవైద్యుడు.

యమకింకరుడు మళ్లీ వచ్చాడు. అతడి పని ఇంకా ముగియలేదు. వసంతసేన ప్రాణాలు ఇంకా వసంతసేన శరీరంలోకి చేరలేదు. అలా చేర్చే పూచీ యమ కింకరుడిది.

వాడు వసంతసేనకు నమస్కారం చేసి, "స్వామీ, తమరు ఈ వేశ్య శరీరాన్ని వదిలి పెట్టాలి," అని ప్రార్థించాడు.

"సరే," అన్నాడు వేశ్యలో ఉన్న స్వాములవారు. ఆయన తన ప్రాణాలను యోగశక్తిచేత పైకి తీసుకోగానే యమ కింకరుడు స్వాములవారి శరీరంలోని వసంత సేన ప్రాణాలను ఆమె శరీరంలోకి చేర్చాడు. స్వాములవారి ప్రాణాలు తిరిగి ఆయన శరీరం చేరుకున్నాయి. యమకింకరుడు వెళ్ళిపోయాడు.

ఇంతసేపటికి వసంతసేన వసంతసేన లాగా ప్రవర్తించసాగింది. ఆమె తన తల్లినీ, రామిలకుణ్ణీ, దాసీలనూ మామూలుగా పలకరించి, మాట్లాడింది. "అమ్మయ్య!" అనుకున్నారు వాళ్ళంతా.

స్వాములవారుకూడా వేశ్యలాగా మాట్లా డటం మానేసి స్వాములవారిలాగా మాట్లా డటం సాగించేసరికి శాండిల్యుడు తృప్తిపడి, "స్వామీ, ఏమిటీ ప్రహసనం? ఎందుకిలా జరిగింది?" అని అడిగాడు.

"సూర్యాస్తమయం అవుతున్నది. అంతా తాపీగా చెబుతాను. మనం పోదాంపద!" అంటూ స్వాములవారు శిష్యుడితోసహా అక్కడినుంచి కదిలాడు.





# రాజైన రైతు

పూర్వం ఫ్రిజియాదేశంలో గోర్డియస్ అనే రైతు యువకుడు ఉండేవాడు. అతను ఒకనాడు తన ఎడ్లబండి కట్టుకుని నగరానికి బయలుదేరాడు.

బండి కొంతదూరం వెళ్ళేసరికి ఎక్కడినుంచో ఒక గరుడపక్షి వచ్చి, ఎద్దులకు మధ్యగా పోలుమీద కూచున్నది. ఇది శుభశకునమని గ్రీకుల నమ్మకం. తనకు కలగబోయే మంచియోగం ఏమిటా అని గోర్డియస్ ఆశ్చర్యపోయాడు.

ఈ సమయంలో టెల్మిసస్ నగరంలో రాజు అకస్మికంగా మరణించాడు. రాజ్యం అరాజకమయింది. ఆ సమయంలో ఒక భక్తురాలికి గణింపూని, రచ్చపట్టులో కూడిన ప్రజలతో ఇలా చెప్పింది:

"మీరేమీ నిరాశపడకండి, మీ రాజు ఎడ్లబండి ఎక్కి ఇటే వస్తున్నాడు. బండిలో అతని సరసన మీకాబోయే రాణికూడా కూర్చుని వున్నది. బండి పోలుమీద ఒక గరుడపక్షి కూచుని ఉన్నది!"

ఈ వివరాలన్నీ తెలియగానే ప్రజలు సంతోషించి తమ కొత్త రాజు కోసం ఎదురు చూడసాగారు.

అయితే, భక్తురాలు చెప్పిన ఈ మాటలు విన్నవారిలో ఒక యువతి గబగబా నగరం వెలపలికి పరిగెత్తింది.

కొంతదూరం వెళ్లాక ఆమెకు ఒక ఎడ్లబండి ఎదురయింది. దాని పోలుమీద గరుడపక్షి కూచుని ఉన్నది. బండిలో ఒక యువకుడున్నాడు—కాని అతని పక్కన ఎవరూలేరు.

నగరం నుంచి వచ్చిన యువతి బండికి ఎదురు వెళ్ళి, గోర్డియస్‌తో, "ఆగు, ఆగు! నన్నుకూడా ఎక్కనీ!" అన్నది.

గోర్డియస్ బండి ఆపి ఆమెను ఎక్కించుకుని తన సరసన కూచోనిచ్చాడు.

ప్రాచీన గ్రీకు కథ

"చూడు, నన్ను పెళ్లాడతానని ప్రమాణం చేశావంటే నీకు ఈ సాయంకాలంలోగా మహా గొప్పయోగం కలిగిస్తాను," అన్నది ఆ యువతి.

తనకేదో యోగం పట్టబోతున్నదని గోర్డియస్ గరుడపక్షిని చూసినప్పుడే అనుకున్నాడు. అందుచేత అతను ఆమె మాటలకు ఆశ్చర్యపడక, ఆమెను ఎగాదిగా చూసి, "నీ అందానికి తగిన వివేకంకూడా ఉంటే నిన్ను పెళ్లాడటానికి నా కేమీ అభ్యంతరం లేదు!" అన్నాడు.

"నా వివేకం గురించి నీ కేమీ సందేహం వద్దు," అంటూ ఆమె భక్తురాలు గణంపూని చెప్పిన మాటలు గోర్డియస్‌తో చెప్పి, "నేనీ బండిలో ఎక్కకపోతే నీవు రాజువు కాలేవు!" అన్నది.

గోర్డియస్ అవునన్నట్టు తల వూపాడు. ఇంకా ఝాము పొద్దుండగానే బండి నగరం ప్రవేశించింది. ఎడ్లబండీ, బండి పోలుమీద గరుడపక్షీ, బండిలో పక్క పక్కనే కూచుని యువతీ యువకులూ కనిపించగానే ప్రజలు ఉత్సాహంతో "రాజు! రాజు!" అంటూ పెద్దగా జయ జయధ్వానాలు చేశారు.

ఈవిధంగా గోర్డియస్ టెల్మిసస్ నగరానికి రాజు అయాడు. తనకి అదృష్టం కలిగించిన బండి పోలుకూ కాడికీ కలిపి ఒక చిత్రమైన ముడివేసి ఆ రెంటినీ ఈశ్వరుడికి అంకితం చేసి దేవాలయంలో ఉంచి, "ఈ ముడి విప్పినవాడు ప్రపంచానికంతకూ సార్వభౌముడవుతాడు," అని చెప్పాడు.

గోర్డియస్ వేసిన ఆ వింత ముడిని విప్పేందుకు చాలామంది ప్రయత్నించారు. కాని సాధ్యం కాలేదు.

ప్రపంచాన్ని జయించటానికి కంకణం కట్టుకున్న అలెగ్జాండరుకూడా ఆ ముడిని విప్పటానికి ప్రయత్నించి, విఫలుడై, విసిగి, చివరకు తన కత్తితో దాన్ని ఛేదించాడట.



# ఆశకు అంతులేదు

ఒక ఊళ్ళో ఇద్దరు బాల్యస్నేహితు లుండేవారు. వాళ్ళల్లో ఒకడు తన ఇరవైయ్యో ఏట హిమాలయాలకు వెళ్ళి, అక్కడ సిద్ధుల్నీ, యోగుల్నీ సేవించి, వాళ్ళవల్ల కొన్ని అపూర్వ శక్తులు సంపాయించి, పదేళ్ళ తరవాత తిరిగి తన స్వగ్రామం వచ్చాడు. గ్రామస్థులు అతణ్ణి ఎంతగానో గౌరవించి, ఊరిబయట వున్న ఒక మామిడి తోటలో అతనికి ఒక చక్కని ఇల్లు కట్టి పెట్టారు. క్రమంగా అతడికివున్న యోగశక్తులను గురించి చుట్టుపక్కల గ్రామాల వాళ్ళు కూడా తెలుసుకున్నారు వాళ్ళు తమకేమైనా శారీరకబాధల్లాంటివి కలిగినప్పుడు, ఈ యోగి దగ్గిరకు వచ్చి, తమ బాధల నుంచి విముక్తులౌతూండేవారు. ఎక్కడో దూరప్రాంతాన కూలీ నాలీ చేసుకు బతుకుతున్న యోగి బాల్యస్నేహితుడికి, ఈ సంగతులన్నీ కొన్నాళ్ళ తరవాత తెలిసినై. వాడు సరాసరి తన గ్రామం వచ్చి, బాల్యమిత్రుడైన యోగిని కలుసుకున్నాడు.

"నీకెలాంటి సహాయం కావాలి?" అని అడిగాడు యోగి తన బాల్యస్నేహితుణ్ణి.

"నేను చాలా బీదవాణ్ణి, ఏదో కాస్త డబ్బిచ్చావంటే, బతికిపోతాను," అన్నాడు స్నేహితుడు. యోగి అక్కడున్న ఒక ఇటుకరాయి కేసి తన చిటికెనవేలు చూపుతూ, "ఆ బంగారం ఎత్తుకుపో," అన్నాడు.

"ఊహుఁ, అది చాలదు," అన్నాడు స్నేహితుడు.

యోగి అక్కడున్న మరో పెద్ద రాతిగుండుకేసి, చిటికెనవేలు చూపుతూ, "అదీ బంగారమే, ఎత్తుకుపో," అన్నాడు.

"ఊహుఁ, ఇదీ చాలదు," అన్నాడు స్నేహితుడు.

"అయితే, ఇంకేం కావాలి?" అన్నాడు యోగి.

"నీ చిటికెనవేలు కావాలి!" అన్నాడు స్నేహితుడు.






ఋష్యశృంగుడు వచ్చి దశరథుడి వద్ద అతిథిగా ఉంటున్నాడు. కొద్దిరోజులు గడిచాయి. వసంతరుతువు ప్రవేశించింది. దశరథుడు ఋష్యశృంగుడితో, "ఇక మీరు యాగం ఆరంభించి నడిపించండి," అన్నాడు. ఋష్యశృంగుడు సరే నన్నాడు.

అశ్వమేధయాగం కోసం పెద్ద యెత్తున ప్రయత్నాలు సాగించారు. యజ్ఞాలు చేసేవారూ, వేదాలు చదివేటందుకు సుయజ్ఞుడూ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడు మొదలైన ఋషులూ, బ్రాహ్మణ శ్రేష్ఠులూ పిలిపించబడ్డారు. ఏమేమి వస్తువులు సమకూర్చాలో వసిష్ఠుడు మొదలైనవారు చెప్పారు. సమర్థుడైన వాణ్ణి గుర్రం వెంట పంపారు. సరయూనది ఉత్తరపుగట్టున యజ్ఞశాల నిర్మించారు. యజ్ఞకార్యాలలో పాల్గొనటానికి వడ్రంగులనూ, బేలుదారీలనూ, చిత్రకారులనూ, నాట్యశాస్త్రంలో ప్రవీణులనూ నియోగించారు. యాగానికి వచ్చే రాజులకు మేడలు కట్టారు. బ్రాహ్మణులకు కుటీరాలూ, భోజనాలకు విశాలమైన పందిళ్లూ తయారుచేశారు. సమస్తమైన రాజులకూ, చతుర్వర్ణాల వారికీ ఆహ్వానాలు వెళ్లాయి. మిథిల రాజైన జనకుడికీ, కాశీరాజుకూ, దశరథుడి మామగారైన కేకయమహారాజుకూ, రోమపాదుడికి ప్రత్యేకాహ్వానాలు వెళ్లాయి. అనేకమంది రాజులను సుమంత్రుడు స్వయంగా వెళ్లి ఆహ్వానించాడు. రావలిసిన వారంతా వచ్చి బసలలో విడిదిచేశారు.



మంచిరోజూ, మంచి ముహూర్తమూ చూసుకుని దశరథుడు యజ్ఞశాలకు బయలుదేరివచ్చాడు. యజ్ఞకర్మ ఆరంభమయింది. మొదటి హవిర్భాగం ఇంద్రుడికి అర్పించి హోమం సాగించారు. యజ్ఞశాల అతిథులతో కళకళలాడింది. భోజనం రాసులుగా పోశారు. వర్ణవిచక్షణ లేకుండా అందరికీ తృప్తిగా భోజనాలు పెట్టించి వస్త్రదానం చేస్తూవచ్చారు.

అశ్వమేధం మూడురోజుల యాగం. అది శాస్త్రోక్తంగా ముగియగానే దశరథుడు తన చేత యజ్ఞం చేయించిన ఋత్విజులకు భూమి యావత్తూ దానం చేశాడు. వారు రాజుతో, "మహారాజా, భూమిని పాలించటం మావల్ల అయే పనికాదు. అందుచేత మాకు భూమి బదులు మణులో, బంగారమో, గోవులో, మరొకటో, ఏది సిద్ధంగా ఉంటే అది ఇప్పించు," అన్నారు. దశరథుడు వారికి పదిలక్షల గోవులూ, నూరుకోట్ల బంగారమూ, నాలుగువందల కోట్ల వెండీ దానం చేశాడు.

తమకు ముట్టిన ధనమంతా బ్రాహ్మణులు ఋశ్యశృంగుడికీ, వసిష్ఠుడికీ సమర్పించారు. వసిష్ఠుడు మొదలైనవాళ్ళు దాన్ని వంతుల ప్రకారం పంచుకున్నారు.

ఇంతలో ఒక దరిద్ర బ్రాహ్మణుడు వచ్చి దశరథుడి ముందు చెయ్యి చాచాడు. దశరథుడు వెంటనే తన చేతి కడియం తీసి ఆ బ్రాహ్మడి కిచ్చేశాడు. బ్రాహ్మణులందరూ దశరథుణ్ణి దీవించారు.

అశ్వమేధం పూర్తికాగానే ఋశ్యశృంగుడు దశరథుడి చేత పుత్రకామేష్టి చేయించాడు. ఆయన అగ్నిలో వేల్చే హవిస్సులు పుచ్చుకోవటానికి సమస్త దేవతలూ అక్కడికి వచ్చి తమ ఉచిత స్థానాలలో కూచున్నారు. అప్పుడు దేవతలు బ్రహ్మతో రావణాసురుడు తమను పెడుతున్న కష్టాలు వివరించి చెప్పుకున్నారు.



దానికి బ్రహ్మ, "దుర్మార్గుడైన రావణుడు దేవ దానవ గంధర్వ యక్ష రాక్షసులచేత చావు లేకుండా వరం అడిగాడు గాని మనుషుల మీది తేలికభావంకొద్దీ వారి వల్ల చావులేకుండా వరం కోరలేదు. ఇదుగో మహావిష్ణువు, దశరథుడి భార్యలలో ఒకరికి కొడుకుగా పుట్టి నరరూపంతో రావణాసురుణ్ణి సంహరిస్తాడు," అని దేవతలతో అన్నాడు. దేవతలు పరమానందం చెందారు.

ఇంతలో హోమగుండం నుంచి కళ్ళు జిగేలుమనే ఒక మహాభూతం పైకి వచ్చింది. ఆ భూతం తన చేతులలో ఒక కలశాన్ని పట్టుకుని ఉన్నది. కలశం మేలిమి బంగారుతో చేసినది, దానిపై మూతవెండిది.

ఆ భూతం దశరథుడితో, "ఓ రాజా, దేవతలు ఈ కలశంలో తాము వండిన పాయసాన్ని నింపి ఇచ్చారు. ప్రజాపతి ఆజ్ఞపై నేను దీన్ని తెచ్చాను. ఈ పాయసాన్ని నీ భార్యల కిచ్చినట్టయితే వారికి గర్భోత్పత్తి అయి, కొడుకులు కలుగుతారు," అన్నది.

దశరథుడు పరమానందంతో ఆ కలశాన్ని అందుకుని, భూతానికి ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. వెంటనే భూతం అంతర్థానమై పోయింది.



దశరథుడు ఆ కలశంలో ఉండే పాయసంలో సగం కౌసల్య కిచ్చాడు. మిగిలిన దానిలో సగం సుమిత్ర కిచ్చాడు. సుమిత్ర కివ్వగా మిగిలిన దానిలో సగం కైకేయి కిచ్చి, ముగ్గురూ తీసుకోగా మిగిలిన పాయసాన్ని మరొకసారి సుమిత్రకే ఇచ్చాడు. త్వరలోనే కౌసల్యా, సుమిత్రా, కైకేయీ గర్భవతులయారు.

ఒక పంక మహావిష్ణువు మానవుడుగా అవతరించటానికి ప్రయత్నాలు సాగుతూంటే, ఇంకోపంక బ్రహ్మ ఆజ్ఞ చొప్పున దేవతలు కామరూపులైన వానరులను సృష్టించారు.



దేవేంద్రుడికి వాలీ, సూర్యుడికి సుగ్రీవుడూ, బృహస్పతికి తారుడూ, కుబేరుడికి గంధమాదనుడూ, విశ్వకర్మకు నలుడూ, అగ్నికి నీలుడూ, అశ్వినీ దేవతలకు మైంద ద్వివిదులూ, వరుణుడికి సుషేణుడూ, పర్జన్యుడికి శరభుడూ, వాయుదేవుడికి హనుమంతుడూ పుట్టారు. వీరందరూ మహా బలులైన వానరశ్రేష్ఠులు. ఇతర దేవతలకు వేలసంఖ్యలో వానరమూక పుట్టింది. వానరులతో బాటే ఎలుగు బంట్లూ, కొండముచ్చులూ కూడా రావణ వధ కోసం పుట్టారు. ఈ వానరులు ఋష్యమూకం అనే పర్వతం దగ్గిర స్థిరపడి, వాలి సుగ్రీవులను రాజులుగా పెట్టుకుని, నలుడూ, నీలుడూ, హనుమంతుడూ మొదలైన వారిని మంత్రులుగా పెట్టుకుని జీవించసాగారు.

పుత్రకామేష్టి ముగిసిన పన్నెండవనెలలో చైత్రశుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రాన కౌసల్య రాముణ్ణి ప్రసవించింది. పుష్యమీ నక్షత్రంలో కైకేయికి భరతుడు పుట్టాడు. ఆశ్లేషా నక్షత్రంలో మిట్టమధ్యాహ్నంవేళ సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు కలిగారు.

అయోధ్యానగరంలో పౌరులు ఉత్సవాలు చేసుకున్నారు. వీధులు జనంతోనూ, నాట్యం చేసేవాళ్లతోనూ, గాయకులతోనూ

కిటకిట లాడిపోయాయి. దశరథుడు అంతులేని గోదానాలూ, అన్నప్రదానాలూ చేయించాడు.

నలుగురు పిల్లలూ క్రమంగా ఎదిగి పెద్దవారవుతున్నారు. ఒక తల్లి బిడ్డలు కాకపోయినా రామ లక్ష్మణులు ఎప్పుడూ కలిసి ఉండేవారు. ఒకేసారి భోజనం చేసి ఒకే చోట నిద్రపోయేవారు. అదేవిధంగా భరత శత్రుఘ్నులు ఎప్పుడూ జంటగా తిరిగేవారు. వారు నలుగురూ వేదశాస్త్రాలు అధ్యయనం చేసి, విలువిద్యలో ఆరితేరి, తండ్రికి ఎప్పుడూ శుశ్రూషలు చేస్తూ యౌవనవంతులయారు. దశరథుడు వారి వివాహాలను గురించి మంత్రులతోనూ, పురోహితులతోనూ ఆలోచనలు ప్రారంభించాడు.

రాజూ మంత్రులూ ఈ ఆలోచనలో ఉన్న సమయంలో ద్వారపాలకులు వచ్చి, తొట్రుపడుతూ, "మహారాజా, కుశిక వంశం వాడు, గాధి రాజుకుమారుడు, విశ్వామిత్ర మహాముని తమ దర్శనంకోరి వచ్చి ద్వారం వద్ద ఉన్నారు," అని చెప్పారు.

వెంటనే దశరథుడు పురోహితుణ్ణి వెంట బెట్టుకుని, విశ్వామిత్రుడికి ఎదురు వెళ్ళి అర్ఘ్యపాద్యాలతో పూజించాడు.

విశ్వామిత్రుడు, "రాజా, నీవూ, నీ ప్రజలూ క్షేమంగా ఉంటున్నారా? శత్రు






భయమేమీలేదుగదా!" అని కుశలప్రశ్నలు చేసి, వసిష్ఠాది మునులను పలకరించి రాజభవనం ప్రవేశించి ఉచితాసనంమీద కూర్చున్నాడు.

"మహామునీ, మీరాక నా కెంతో ఆనందాన్ని కలిగించింది. నావల్ల మీకు కావలిసినదేమిటి?" అని దశరథుడు విశ్వామిత్రుడితో అన్నాడు.

విశ్వామిత్రుడు ఈ మాటకు సంతోషించి, "రాజా, నేను వచ్చిన పని నెరవేర్చి సత్యసంధుణ్ణి అనిపించుకో. నేనొక యాగం తలపెట్టి ఆరంభించేసరికి ఇద్దరు రాక్షసులు, బల పరాక్రమవంతులు, నా యజ్ఞవేదికపై



రక్తమాంసాలు కుమ్మరించి అపవిత్రం చేసి, నా వ్రతసంకల్పం పాడుచేశారు. ఆగ్రహించి వారికి శాపమిద్దామంటే నా వ్రతసంకల్పం భంగమవుతుంది. అందుకని బయలుదేరి ఇక్కడికి వచ్చాను. నా వెంట నీ పెద్ద కొడుకైన రాముణ్ణి పంపించు. నా యజ్ఞాన్ని మారీచ సుబాహులనే ఆ రాక్షసులు భగ్నం చెయ్యకుండా ఈ కుర్రవాడు రక్షిస్తాడు. రాముడు ఆ రాక్షసులను సులువుగా చంపగలడు. ఆ సంగతి వసిష్ఠుడుకూడా ఎరుగును," అన్నాడు.

ఈ మాటలు వినగానే దశరథుడి గుండె బద్దలయినట్టయింది, భయమూ దుఃఖమూ ముంచుకొచ్చాయి. ఆయన సింహాసనంమీది నుంచి లేచి గడగడా వణుకుతూ, "మహామునీ, రాముడు పసివాడు. వాడి కింకా పదహారేళ్లయినా నిండలేదు. వాడికి విలువిద్యకూడా సరిగా రాదు. వాడు రాక్షసులతో ఎక్కడ యుద్ధం చేస్తాడు. నా దగ్గిర ఒక అక్షౌహిణిసేన ఉన్నది. నేనే వచ్చి ఆ రాక్షసులను చంపేస్తాను. ఇంతకూ ఆ రాక్షసులెవరు? ఎంత ఒడ్డూపొడుగూ ఉంటారు? ఎవరి కొడుకులు?" అన్నాడు.

దానికి విశ్వామిత్రుడిలా చెప్పాడు: "రావణుడనే రాక్షసరాజును నీ వెరుగుదువు



కదా! అతడు బ్రహ్మను మెప్పించి గొప్ప శక్తులు పొందాడు. ఇంతకూ ఆ రావణుడు విశ్రవసుడి కొడుకు, కుబేరుడికి సాక్షాత్తూ తమ్ముడు. అతను స్వయంగా యజ్ఞభంగం చెయ్యలేనప్పుడు ఈ బలశాలులైన మారీచ సుబాహులను పంపుతూ ఉంటాడు."

"ఓయమ్మో! రావణుడే? అతడిముందు నేనే నిలవలేనుగదా, పసివాడు రాముడెలా నిలుస్తాడు? ఆ మహాశక్తి మంతుడి పైకి రాముణ్ణి పంపించటం ఎంత మాత్రమూ పొసగదు," అన్నాడు దశరథుడు.

కోపంతో విశ్వామిత్రుడి కళ్ళు ఎర్రబడ్డాయి. "మహారాజా, ఆడినమాట తప్పే వాడివనే అపకీర్తి మోస్తూ సుఖంగా ఉండు!" అంటూ ఆయన చివాలున లేచాడు.

అప్పుడు వసిష్ఠుడు దశరథుణ్ణి మందలిస్తూ, "రాజా, నీవు చేయరాని పని చేస్తున్నావు. ఆడినమాట తప్పి ఇక్ష్వాకు వంశానికి కళంకం తెస్తున్నావు. విశ్వామిత్రుడంటే ఎవరనుకున్నావు? ఆయనకు తెలియని అస్త్రం లేదు, కొత్త అస్త్రాలుకూడా సృష్టించగలవాడు. ఆయన ఆ రాక్షసులను చంపలేక ఇంత దూరం వచ్చాడనుకున్నావా? నీ కొడుకులకు మేలు చేసేటందుకు వచ్చాడు. రాముణ్ణి నిశ్చింతగా ఆయన వెంట పంపు. ఆయనవెంట ఉండగా అతనికి ఏ ప్రమాదమూ రాదు," అని బోధించాడు.

ఈ మాటలతో ధైర్యం తెచ్చుకున్నవాడై దశరథుడు రామ లక్ష్మణులను పిలిపించి, వారిని విశ్వామిత్రుడికి అప్పగించాడు. విశ్వామిత్రుడు ముందు నడుస్తుంటే చక్కగా అలంకరించబడిన రామ లక్ష్మణులు ఒకరి వెనక ఒకరుగా ఆయనను అనుసరించారు. వారిద్దరి వద్దా విళ్ళున్నాయి. వారి చేతులకు ఉడుము తోలుతో చేసిన తొడుగులున్నాయి. వేళ్లకు కూడా తొడుగులున్నాయి. వారు చేతులలో కత్తులు పట్టుకుని విశ్వామిత్రుడి వెనకగా నడవసాగారు.



# ఖ జు రా హొ

ఈనాడు ఖజురాహొ మధ్యప్రదేశంలోని ఒక మారుమూల గ్రామం. కాని మధ్యయుగం నాడిది భారతదేశంలోని ప్రముఖ నగరాలలో ఒకటి. భారతీయ శిల్పకళలో ఖజురాహొ శిల్పాలకు ఒక విశిష్టస్థానం ఉన్నది. ఎందుకంటే ఇక్కడి శిల్పవిధానం మనదేశంలోని మరే ప్రాంతంలోనూ కానరాదు.

ఒకప్పుడు ఇక్కడ 85 దేవాలయా లుండేవట. ఇప్పుడు 30 మాత్రమే ఉన్నాయి. దాదాపు ఇవన్నీ క్రీ.శ. 950—1050 మధ్యకాలంలో నిర్మించినవి. ఈ ఆలయా లన్నిటినిండా ఎంతో అందమైన జిలుగు చెక్కడపు పని కనిపిస్తుంది. ఇటువంటి శిల్పం మరెక్కడా కానరాదు.

ఈ ఆలయా లన్నిటిలోకీ పెద్దదీ, అత్యంత నైపుణ్యంతో నిర్మించినదీ కంటరియా మహా దేవాలయం. ఈ ఆలయంలో ఉన్న 800 శిల్ప ప్రతిమలలో ప్రతి ఒకటీ ఒక మహా శిల్పమే. దీనివలెనే చతుర్భుజాలయమూ, పార్శ్వనాధాలయమూ మొదలైన మరికొన్ని ఆలయాలుకూడా మనోహరమైన నిర్మాణంకలిగి, అంతులేని అందమైన శిల్పాలతోనూ, ప్రతిమలతోనూ, మలిచిన స్తంభాలతోనూ అలలారుతున్నాయి.





# ప్రశ్నోత్తరాలు

1. ముసుకుట్ల కృష్ణారావు, దువ్వ

బేతాళ కథలు ఎప్పటినుంచి ప్రచురిస్తున్నారు? ఆ కథలు ఏ పుస్తకము నుండి తీసుకొనబడినవి?

1955 సెప్టెంబరు నుంచి బేతాళ కథలు ప్రచురిస్తున్నాము. వాటిలో కొన్ని వాస్తవంగా బేతాళ కథలే. మిగిలినవి కథా సరిత్సాగరం నుంచీ, ఇతర పుస్తకాల నుంచీ తీసుకుంటున్నాము.

2. వుప్పల రాజబాపయ్య చౌదరి, నాగాయిలంక

ఫొటో సమూనాలకు మా యిష్టమువచ్చినన్ని వాక్యాల సెట్టులు వ్రాసి పంపవచ్చునా?

ఎన్ని సెట్టులైనా పంపవచ్చు. ఏమీ ఆక్షేపణ లేదు.

3. వి. గిరిజ, మద్రాసు

మామయ్యా, ఏప్రిల్ నెల సంచికలో ఫొటో వ్యాఖ్యల పోటీ లేనందున కొంత లోపం కనిపిస్తున్నది. కారణం ఏమిటి?

ఫొటో వ్యాఖ్యలపోటీ ఉన్నది. కాని వ్యాఖ్యలతోబాటు అట్ట లోపల పెద్ద ఫొటోలు వెయ్యలేదు. కాగితం ఖర్చు తగ్గించాలనే ఈ విధంగా చేశాం.

4. కె. నర్సింగ్ రావు, హైదరాబాద్

"సీతావనవాసం" [మార్చి 61] లో "ఆ శంబూకుణ్ణి వెతుక్కుంటూ రాముడు విమానంలో బయలుదేరాడు" అని ఉన్నది. పూర్వకాలము విమానాలు ఉండేవా, అన్నయ్యా?

అసలు రాముడనేవాడు ఉండేవాడని మనకు రామాయణం చదివితేనేగద తెలిసింది ఆ రామాయణంలోనే, పుష్పకమనే విమానంకూడా ఉండినట్టు వాల్మీకి రాశాడు. అంతకంటె మనకేమీ తెలియదు.

5. పి. నాగేంద్రరావు, నూజివీడు

మామా! ఎట్టి కథలు పంపిన నీవు వేసుకొందువు?

అల్లుడా! నీబోటి పాఠకులు చదివి హెచ్చుగా ఆనందించు కథలు పంపిన వేసు కొందును.

6. సాగి సత్యవతి, వేల్పూరు

కొన్ని మాసముల నుండి ముఖచిత్రమును గురించి తెలుపుటలేదు. కారణమేమిటి?

నాటక కథల ఘట్టాలనే ఇటీవల ముఖచిత్రాలుగా వేస్తూవస్తున్నాము. ఇకనుంచీ రామాయణ కథ నుంచి ముఖచిత్రాలు ప్రచురిస్తాము.

7. సూర్యభాస్కర్, పిప్పర

"కొయ్యగుర్రం" [ఏప్రిల్ 61] లో కొయ్యగుర్రం మీద ముందు రాజకుమారుడు, వెనుక రాజకుమార్తె కూర్చున్నట్లు వ్రాసి, చిత్రములో ముందు రాజకుమార్తె, వెనుక రాజకుమారుడు కూర్చున్నట్లు చిత్రించినారు—

అవును, పొరపాటే.

8. కట్టాఇంటి జయరామిరెడ్డి, ఏటియావలి తాండ్రపాడు

అన్నయ్యా! "స్వర్గ నరకాలు" [ఏప్రిల్ 61] లో వ్రాసినట్లు స్వర్గం నుంచి అథఃపాతాళానికి రైళ్ళుంటాయా?

ఉండవు. అదంతా కల్పన. కల్పనేకదా కథకు ప్రాణం!

9. సి. హెచ్. పి. సుబ్బారెడ్డి, పొదిలెకొండపల్లి

చిత్రకారుడైన వడ్డాది పాపయ్యగారి అడ్రసు ఏమిటండీ?

శ్రీ వడ్డాది పాపయ్య, ప్రసాద్ ప్రొసెస్, వడపళని, మద్రాసు - 26.

10. పి. సాంబశివరావు, విశాఖపట్నం

"చిత్రకారుల యుక్తి" [ఏప్రిల్ 61] లో "అచ్చు గుద్దినట్టు" అని రాశారు. ఆ కాలంలో అచ్చులు లేవుగదా!

"అచ్చు గుద్దటం" అంటే పుస్తకాలేనా? మట్టిబొమ్మలు చేసేవాళ్ళు ఒకేరకం బొమ్మలు హెచ్చు సంఖ్యలో చేసేటప్పుడు "అచ్చులు" ఉపయోగించరా?

# త్యజనం ★ స్వామి రామతీర్థ

ఒకనాడు ఇద్దరు సాధువులు కలిసి ప్రయాణం చెయ్యటం తటస్థించింది. వారిలో ఒకడు సర్వమూ త్యజించినవాడు. అన్నిటినీ విడిచి పుచ్చినప్పుడే జన్మ తరిస్తుందని ఆయన నమ్మకం. ఆయన వద్ద చిల్లిగవ్వలేదు.

రెండవ సాధువుకు ఆ నమ్మకం లేదు. మనిషి ప్రపంచంలో ఉన్నంతకాలమూ డబ్బు లేకుండా జరగదని ఆయన నమ్మకం. అందుచేత ఆయన వద్ద ఎప్పుడూ కొంత డబ్బు ఉండేది.

ఇద్దరూ సాయంకాలం దాకా నడిచి చీకటిపడే వేళకు ఒక నది వద్దకు వచ్చారు.

"ఈ రాత్రికి నది ఒడ్డునే గడిపి, రేపు నది దాటే మార్గం చూతాం," అన్నాడు డబ్బులేని సాధువు

"ఇక్కడ ఒక గ్రామం లేదు. నిర్జన ప్రదేశం. ఏ పాములో, క్రూరమృగాలో రావచ్చు. ప్రాణాపాయం కలగవచ్చు. కేక పెట్టినా వినే వాడుండడు. నా దగ్గిర డబ్బున్నది. పడవ వాడికి డబ్బు పారేసి నది దాటి గ్రామానికి వెళ్ళటం క్షేమం," అన్నాడు డబ్బుగల సాధువు.

ఇద్దరూ పడవమీద నది దాటారు. గ్రామం చేరుకుని, సత్రానికి వెళ్ళి, భోజనం చేసి, సుఖంగా పడుకున్నారు.

"చూశారా, మీరు అన్నిటినీ వర్జించమంటారు. నా దగ్గిర డబ్బు ఉండబట్టేగదా మనం నది దాటి క్షేమంగా ఈ రాత్రికి ఈ సత్రంలో బస చెయ్యగలిగాం," అన్నాడు డబ్బున్న సాధువు.

"డబ్బు ఉండటం వల్ల కాదు మనకు క్షేమం కలిగింది—డబ్బును త్యజించటం వల్ల. నేనన్నది అబద్ధం కాదు. త్యజనం వల్లనే మనిషి తరించగలడు," అన్నాడు డబ్బులేని సాధువు.



# అట్టచివరిబొమ్మ

తరవాత కృష్ణార్జునులు తిరిగి యుద్ధభూమికి బయలుదేరారు. కృష్ణుడు అర్జునుడితో, "పదిహేడు రోజుల నుంచీ యుద్ధం సాగుతున్నది. ఉభయ సేనలూ క్షీణించాయి. కౌరవపక్షాన మిగిలిన మహారథులు అశ్వత్థామ, కృపుడు, కృతవర్మ, కర్ణుడు, శల్యుడు మాత్రమే. ఈ అయిదుగురినీ చంపినట్టయితే నీవు జయించినట్టే," అన్నాడు.

ఈ లోపుగా యుద్ధరంగంలో భీముడు ఒంటరిగా అతి దారుణమైన శత్రునాశం చేస్తున్నాడు. అతన్ని శత్రుయోధులు చుట్టుముట్టారు. భీముణ్ణి ఎలాగైనా చంపమని దుర్యోధనుడు శకునిని పురమాయించాడు. శకుని భీముడితో పోరాడి, చావుదెబ్బతిని ప్రాణాలతో తప్పించుకున్నాడు.

భీముడి దెబ్బకు తట్టుకోలేక పారిపోయి ధృతరాష్ట్రుడి కొడుకులు కర్ణుణ్ణి ఆశ్రయించారు. కర్ణుడు గొప్పగా యుద్ధంచేశాడు. కృష్ణుడు అర్జునుడి రథాన్ని కర్ణుడికేసి పోనిచ్చాడు. కాని వారిద్దరికీ ద్వంద్వయుద్ధం పొసగలేదు, ఉభయ పక్షాలమధ్య దొమ్మియుద్ధమేసాగింది.

కాని ఈ యుద్ధంలో దుశ్శాసనుడు విజృంభించి పోరాడుతూ ఉండటం గమనించి భీముడు, లేడిపైబడే సింహంలాగా అతన్ని ఎదుర్కొన్నాడు. ఇద్దరూ ఒకరి ప్రాణాలు ఒకరు తీసుకునే ప్రయత్నంలో పోరాడారు.

మొదట్లో దుశ్శాసనుడు తన బాణాలతో భీముణ్ణి బాగానే నొప్పించాడు. కాని ఒకరిమీద ఒకరు శక్తులూ, గదలూ ప్రయోగించు కోవటంలో భీముడు విసిరిన ప్రచండమైన గద దుశ్శాసనుడి రథాన్ని చూర్ణంచేసింది. అతని తలకు గద తగిలి గాయమైంది. దుశ్శాసనుడు బాధతో పొరలసాగాడు.

వెంటనే భీముడు పెడబొబ్బలుపెట్టి, రథంమీది నుంచి దూకి దుశ్శాసనుడి వద్దకు పరిగెత్తుతూ, ఈ దుశ్శాసనుడు నిండు సభలో ద్రౌపదికి చేసిన అవమానం తలుచుకుని మండిపడుతూ, "ఓరీ, కర్ణా! ఓరీ, దుర్యోధనా! ఈ దుశ్శాసనుణ్ణి చంపబోతున్నాను. చాతనయితే రక్షించుకోండి," అని కేకపెట్టాడు.

భీముడు దుశ్శాసనుడి కంఠం మీద ఒక కాలువేసి తొక్కిపట్టి, కత్తితో అతడి గుండె చీల్చి, రక్తంతాగి, ఆ కత్తితోనే అతడి తల నరికేసి, "పాపాత్ముడా, మృత్యుదేవత నిన్ను కాపాడింది. ఇంక నిన్నేమీ చేయలేను!" అన్నాడు.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వాఖ్యలు 1961 అగస్టు సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నీరు తాగే, గోవా!

రెండవ ఫోటో: విప్పు తేరా, బావా!

పంపినవారు: ఉచ్చూరు రమణారెడ్డి

పల్లప్రోలు, బుచ్చిరెడ్డిపాలెం (P.O.) నెల్లూరు జిల్లా

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు తోటలో నడుస్తూండగా, కొంటె కుర్రాడొకడు పెద్ద కాట్లకుక్క నొకదాన్ని వెంట పెట్టుకొని, వాళ్ళకు అంత దూరంలో కనిపించాడు. దాసూ, వాసూల వెంటవున్న 'టైగర్'ను చూస్తూనే కాట్లకుక్క పెద్దగా మొరిగి, దాన్ని కరిచేందుకు రాసాగింది. కొంటెకుర్రాడు, 'పారిపోండి, పారిపోండి!' అంటూ దాసూ, వాసూలకేసి కేకపెట్టాడు. ఇంతలో పొదల చాటు నుంచి ఒక గొఱ్ఱెపొటేలు ముందుకు దూకి, కాట్లకుక్కను ఢీ కొట్టేందుకు పరిగెత్తింది. దాన్ని చూస్తూనే కొంటెకుర్రాడూ, వాడి కుక్కా కాలిబలం కొద్దీ తోటలో నుంచి పారిపోసాగారు. 'టైగర్' వాళ్ళ వెంటపడి తరిమింది.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


పసుపుపచ్చ
LUX
Yellow


ఆకుపచ్చ
LUX


నీలం
LUX
Blue


లేత గులాబీ
LUX



Photo by V. M. Panjabi



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీరు తాగే, గోవా!

పంపినవారు:
యు. ఆర్. రెడ్డి, పల్లాప్రోలు

Photo by Subash Varma



బహుమతి పొందిన వ్యాఖ్య

నిప్పు తేరా, భావా!

పంపినవారు: యు. ఆర్. రెడ్డి, పల్లాప్రోలు



# మీ పాపాయికి ఇష్టం

# స్పెన్సర్స్ గ్రైప్ సిరప్

పసిపిల్లల సమస్తమైన అజీర్ణ వ్యాధులకు




ఆంధ్రప్రదేశ్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్లు:

**సిటీ ఫార్మ డిస్ట్రిబ్యూటర్స్,**

రామగోపాల్ స్ట్రీట్, :: విజయవాడ-1.

---

# నోపిన్ పెద్ద ట్యూబు కొని డబ్బు ఆదా చేయండి!

కండరముల నెప్పి

ఒక పెద్ద ట్యూబు మూడు చిన్న ట్యూబులకు సమానము.

గుండె జలుబు

సయాటికా

నోపిన్ మర్దనా చేసిన వెంటనే చర్మపు లోపలి భాగమందు బాగా లోతుగా ప్రవేశించి, అచ్చటినుండి అదనపు రక్తమును పైకి తీసికొని వచ్చి, మంచి హాయి నిచ్చే వేడి పుట్టించి, ఆ వేడివల్ల నెప్పిని పోగొట్టుతుంది.

నోపిన్ కుటుంబవారికి అక్కర వస్తుంది.

నోపిన్ పరిశుభ్రమగు ట్యూబులలో నింపబడి సీలువేయబడి వచ్చును, అందువల్ల దినముల శక్తి తీసిపోక, శక్తి కాకుండా ఉండి, దానిని ఎల్లప్పుడు బలంగాను, ముసాలతోను ఉంచును.

ఎల్లప్పుడు ఒక నోపిన్ ట్యూబును అందుబాటులో ఉంచుకొనుడి.

ది కలకత్తా కెమికల్ కం. లి.,
కలకత్తా-29

CNF-116-60

దక్షిణ ఇండియా ఆఫీసు : 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.

"రెండిటిలో ఏది కావాలి—
రుచి ప్రధానంగా మిశ్రమంచేసిన
పరిశుద్ధమైన ఇండియన్ కాఫీయా,
ప్రత్యేక తరహాల
ననుసరించి తయారుచేసిన
ఫ్రెంచి కాఫీయా?"




**PURE INDIAN COFFEE**

**STANES FRENCH**

G. ST. 12

THE UNITED COFFEE SUPPLY COMPANY LIMITED, COIMBATORE.

"ఔను ఇవి బిన్నీ బట్టలే..."

"...శాంతి కెప్పుడూ కేస్‌మెంట్ గుడ్డలో బట్టలు కుట్టిస్తాను—వాళ్ల స్కూలువాళ్లు ఆ గుడ్డే బావుంటుందని చెప్పారు. ఫ్రాకులకు స్కర్ట్‌లకూ ఇంతకన్న మంచిది దొరకదు.... ధోతే, బ్లౌజులకు, బిన్నీ క్రేపు ఎఫ్. ఎస్. 10ని వాడుతాను.... మోహన్‌కి టస్సూర్ గుడ్డలో కుట్టిస్తాను. కుర్రాళ్లకి ఇంతకన్న మంచిగుడ్డ ఎక్కడ దొరుకుతుంది చెప్పు."




బకింగ్‌హామ్ & కర్నాటిక్ కంపెనీ లిమిటెడ్
బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్ వారి శాఖ

మీకు కావలసిన బిన్నీ గుడ్డలన్నీ అనుమతిపొంది ఈ బోర్డును ప్రదర్శించే బిన్నీ వ్యాపారస్తుల వద్ద కంట్రోలు రేటుకు కొనవచ్చు.

JWT-BC-SR 1306a

83

